శ్రీ

# వీరయోగీంద్ర జ్ఞానోపదేశము.



## ప్రథమభాగము.



ఓంకారసంఖ్యాతనమస్తదేవా పురాణపుణ్యాగమపూజితాయ।
ఓంకారవర్ణత్రయదర్శితాయ ఓంకారరూపాయనమశ్శివాయ॥

బ్రహ్మశ్రీ

ముండూరి - అప్పయాచార్యులువారివలన

సమకూర్చబడి

శ్రీవీరయోగీంద్ర శిల్పవిద్యాభివర్ధనీ సమాజమువారివలన
ప్రచురింపబడినది.

చెన్నపురి:
వైజయంతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపంబడినది.

1905.

ఈ పుస్తకము విజియనగరం శ్రీవీరయోగీంద్ర శిల్పవిద్యాభివర్ధనీ సమాజమునందు వెలకు దొరకును.

 [Pri...

# ప్రకటన.

శిల్పవిద్యాభివర్ధనీ సమాజ మనగా శిల్పములను వృద్ధి చేయుటకు 100 రూ॥ పూర్ణభాగము లేక 50 రూ॥ అర్ధభాగము నిర్ణయరుసుములతో చెల్లించి భాగస్థులుగా యేర్పడి లాభించెడు వ్యాపారములను చేయుచు వచ్చెడిలాభములో చతుర్థాంశము మూలధనముక్రింద నుంచి తక్కిన మూడుభాగములు భాగిస్వాములు నిర్ణయప్రకారము భాగించుకొనెడివారి సంఘము. ఈపుస్తకము గొనువారిలో వచ్చెడునుగాదికి రాగల చైత్రమాసమందు జరగబోయేసభలో యీ క్రింద వివరించినట్టుల మూడుబహుమానములు యెవరిపేరను వస్తే వారికి పంపబడును.

విజియనగరము,
శ్రీ వీరయోగీంద్ర
శిల్పవిద్యాభివర్ధనీ సమాజము.

కొసనాచిన - పైడయాచారి,
కార్యనిర్వాహకులు.

కోటపల్లి - సుబ్బారావుపంతులు,
కార్యదర్శి.

# వీరయోగీంద్ర జ్ఞానోపదేశము.

## ప్రథమ భాగము.

ఓంకారసంఖ్యాతసమస్తదేవా పురాణప్రత్యాగమపూజితాయ।
ఓంకారవర్ణత్రయసన్నితాయ ఓంకారరూపాయనమశ్శివాయ॥

బ్రహ్మశ్రీ

ముండూరి - అప్పయాచార్యులువారివలన

సమకూర్పబడి

శ్రీవీరయోగీంద్ర శిల్పవిద్యాభివర్ధనీ సమాజమువారివలన
ప్రచురింపబడినది.

చెన్నపురి:
వైజయంతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపంబడినది.

1905.

ఈ పుస్తకము విజయనగరం శ్రీవీరయోగీంద్ర శిల్పవిద్యాభివర్ధనీ సమాజమునందు వెలకు దొరకును.

# విషయసూచిక.

శ్రీ

# వీరయోగీంద్రులవారి చరిత్రము.

శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబంధుషు।
సాధుష్వపిచపాపేషు సమబుద్ధిర్విశిష్యతే॥

విశ్వకర్మకులజులును, శ్రీగారుళపురవాసులును, సువర్ణసగోత్రజులును నగు ముండూరి - అప్పయ్యదేవునకు పార్వతాంబయందు శుభలక్షణములతో జ్యేష్ఠపుత్రులుగా నుద్భవించిన బ్రహ్మశ్రీ వీరయోగీంద్రస్వాములవారు విద్యాభ్యాసమును తండ్రిగారివల్ల నేర్పింపబడి పంద్రెండేండ్లవయసునందు గంగాబాయి యనునారీరత్నమును పరిణయమై తమపరిపిత్రుహీనమైన కుటుంబపోషణార్థమై అలకాపట్టాలపురిలోనొకారి మేస్త్రీయుద్యోగమును వహించి

శ్లో॥ పోష్యవర్గార్థసిధ్యర్థం న్యాయవర్తీతుబుద్ధిమాన్।
న్యాయోపార్జితవిత్తేన కర్తవ్యంహ్యాత్మరక్షణం॥

నిటుల బుద్ధిశాలియై తనమేలును, పరులమేలును తాము పోషింపదగినవారికి మేలగుటను నెరింగి వర్తించువారలై న్యాయార్జనధనముచేతి నిర్వహించుచు

శ్లో॥ మాసాన్‌దశోధరస్థం యాధృత్వాశూలైస్సుమాకులావేదనా।
వివిధైఃదుఃఖైప్రసూయే తవిమూర్ఛితా॥

శ్లో॥ ప్రాణైరపిప్రియాన్‌పుత్రాన్ మన్యతేసుతవత్సల।
కస్తస్యానిష్కృతింకర్తుం శక్తోవర్షశతైరపి॥

కడుపులో నున్నబిడ్డను పదిమాసములు ధరించి [illegible] వేదనొందినదై స్మృతి తప్పి [illegible] జీవముకన్నను హెచ్చుగా భావించి [illegible]త్యుపకార మెన్నటికిని చేయుట కెవ్వరికి శక్తిలేదని ఋణబద్ధుడైనటుల మతల్లియైనపార్వతాంబమాత జవదాటక "మాతృదేవోభవ" యని భక్తి సల్పుచు అహోకవా[illegible]

దప్పకుండునటులనే సాంధ్యాకాలములయందు పరమేశ్వరధ్యానకుతూహలులై తమ కనిష్టులను తండ్రివలె సంరక్షించుచు

శ్లో॥ పున్నామ్నోనరకాత్యస్మా పితరంత్రాయతేసుతః।
తస్మాత్పుత్రఇతిప్రోక్త స్వయమేవస్వయంభువః॥

ఇట్టి వంశప్రదీపకంబగు సుపుత్రరత్నమును బడసి తండ్రిగారిపేరున నామకరణము జేసి నిటుల కుటుంబవృద్ధిని పొందుచున్న శ్రీస్వాములవారియాంతర్యము జ్ఞానశక్తియం దభివృద్ధి నొంది

శ్లో॥ నలినీదలగతజలవ త్తరలంకింయవ్వనంధనంచాయుః।
కథయఃపునఃకేశశినః కిరణసమాస్సజ్జనాఏవ॥

అశాశ్వితములైన శరీరములయందు భ్రమించక శాశ్వితపదవిని బడయగోరి కడపలో అపరోక్షజ్ఞానసంపన్నులైన శ్రీ హీ రామాన్ దాదాగారివలన యాత్మోపదేశమును బొంది చెన్నరాజధానియందంతటను, బర్మాద్వీపమందును నిరువదిసంవత్సరము లనేక పండితపామరులకు స్త్రీపురుషాదిభేదములేక

శ్లో॥ నమశ్శివాయమంత్రోయం వాగేషావశవర్తినీ।
అహోమోహస్యమాహాత్మ్యం నరకంయేనపస్యతి॥

ఇట్టి పంచాక్షరీమంత్రపూర్వకంబుగా ఉపనిషత్సారమైన బ్రహ్మవిద్య నుపదేశించుచు గణనాతీతముగా ప్రజాసంఘములను సంస్కరించుచు భాగవతోత్తముల సహాయ్యముచే జీవేశ్వరాలయము శ్రీగాకుళములో నాంగుళ్యానదీతీరమున ప్రతిష్ఠించి భక్తిజ్ఞానవైరాగ్యతత్వమోక్షములను సులభసాధ్యమగునటుల మానసవైరాగ్యమను మానసబోధను, పరబ్రహ్మానందబోధమను పార్వతీపరమేశ్వరసంవాదమును, పరాత్పరనాయకీశతకమను పరాత్పరస్థవమును, ధృవరాజయోగసార మనుధృవునకు జేసినసారదోపదేశంబును నగు నాలుగుగ్రంథములు సుబోధకంబుగా రచించి ఏబది సంవత్సరములక్రిందటనుంచి యే ముద్రింపజేసి ధర్మార్థముగా బ్రచురపరచుచుండుటయేగాక భగవద్భజనమునకు తత్వసంకీర్తనల జెప్పుచు సత్పుత్రునిచే జేయబడిన నుపచారముల భగవత్ప్రీతిగా నంగీకరింపుచు లోకోపకారమైన సత్కర్మ సర్వదా ఆచరనియ్యమని బోధించినటుల ధర్మార్థవైద్యమును జేయుచు సమస్తస్త్రీపురుషులను కులమతభేదముల నెంచక తల్లిదండ్రులభావనచే జూడవలయుననునీతిని వెల్లడిచేయు

విద్వద్భి రేవసహ... ...తీర్తి ప్వలీయం।
యస్యాస్తినద్వయమిదం స్ఫుటమేవసోంధ।
స్తశ్యాప్యమార్గచలనే వదకోపరాధః॥

...వివేకసస్నహవాసముల నందినమానవునకు మేలు సిద్ధమని బోధించుచు సర్వ...
...స్థతులనియును, సత్కర్మనిరతులనియును, రాజయోగీంద్రులనియును, మహా...
...లనియును, ఉత్తమగ్రహస్తులనియును, సద్గురువులనియును, దయానిధియని
... వేనోళ్ల పొగడందుచు సర్వకాలసర్వావస్థలయందు భగవంతునియనంత
...గుణగుణంబుల పలువిధంబుల వర్ణింపుచు నిత్యానందభజనంబులు గావింపుచు
...కెరక తమపాదాక్రాంతులయి వచ్చుచుండెడిశిష్యకోటికి అనంతములైన సర్వ...
...రము లగుధర్మములు మహాకవీశ్వరుండైన వేమనపద్యపూర్వకముగా

శ్లో॥ జితేంద్రియత్వమ్ వినయస్యకారణం।
గుణప్రకర్షో వినయాదవాప్యతే।
గుణాధికేపుం సిజనోనురజ్జతే।
జనానురాగ ప్రభవాహిసంపదః॥

...నువల్ల జితేంద్రియత్వము సద్గుణపూజ్యత పొందబడుచున్నది. అట్టిపురుషుని
...క మనురాగించుచున్నది. అని యుపన్యసించుచు లోకమే తనకుటుంబ...
...దేనివల్లగాని ప్రతిఫలము నపేక్షించక శరీరసౌఖ్యములయం దాసక్తి కలి...
...నక అఖండసచ్చిదానందరూపమైన యాత్మయందే రతిగలిగి

శ్లో॥ గోవిందేతిసదాస్నానం గోవిందేతిసదాజపం।
గోవిందేతిసదాధ్యానం సదాగోవిందకీర్తనం॥

...ర్గప్రకారము శ్రీస్వాములవారు డెబ్బదిసంవత్సరము లేక ధ్వజముగా జ్ఞాన...
...మును సతీయుక్తులుగా పరిపాలించి తమయుత్కృష్టయోగమహిమను హిందూ...
...దంతటను ప్రజ్ఞావంతులైన తమశిష్యవర్గముద్వారా వ్యాపింపజేయుచు

శ్లో॥ రసాయనమయీశీతా పరమానందదాయనీ।
నానందయతికంనామా సాధుసంగతిచంద్రికా॥

త్సరములు రెండిట తమయర్ధాంగలక్ష్మి ... గా తమయసాధ
ప్రకటింపజేయు శతవత్సరజీవనయాత్ర పూర్తిజేసి; "మాసానాం మార్గశీ
తిథీనామ్ యేకాదశో౽హం" అను భగవద్వాక్యప్రకారం విజయనగరములో
సంవత్సర మార్గశిర శుద్ధ ఏకాదశీ శనివారం పుణ్యతిథి రాత్రి పదిగంటలనరకు
దేశములవెలంగించిన నాటిసూర్యుం డస్తమించినటుల తమపుత్రపౌత్ర ...
లుగాగల దేహసంబంధులును, యాత్మసంబంధు లగుశిష్యులమధ్యను తమస
భాగవతోత్తములు భజనచేయుచుండగా పురవాసులందరు నిండుకొనియుండ
సముద్రమునందు శయనించియున్న శ్రీమన్నారాయణునివలె యుత్తరాభిముఖం
జీవితకాలమును "సత్యంవద ధర్మంచర" యనునటుల గడపి "అంత్యేగతిః
గతిః" యను నిర్మలాంతఃకరణమే మోక్షప్రదంబనుచు బ్రహ్మపదవాచ్య మగు
వము నుచ్చరించుచు బ్రహ్మైక్యము నొందిరి. వారిదర్శనస్పర్శనసంభా
మోహితులైన సమస్తప్రజలు "పుణ్యపురుషునిచావు భూలోకమందరికి
గ్రుంగినట్లు యుండువేమా" అనునటుల సంతాపమగ్నులై యుండిరి. "ఆ కో
విధ మెరిగిన చేకొని యా మూలధనము చెదరకయుండున్, యేకల్పాంతము
యేకాలము చిన్నవయసు యెప్పుడువేమా" అనునట్లు ఇట్టిమహానియ్యులు మృతి
శాశ్వితలోకమందు నిరామయసుఖము లనుభవించువారు. శ్రీస్వాములవారి
సద్గుణములచేతను, ఆత్మసాక్షాత్కారమహిమచేతను, పసిబిడ్డబాలాదిగా
షులు, పండితపామరులు మగ్నతనొందియున్నవారలు. ఈ మాధుర్య
వా రెప్పటికిని మరువ శక్యమైనదికాదనునటుల శ్రీస్వాములవారిదేహ
దకముచే స్నానము జేయించి నేలంబడిన యా పవిత్రోదకమును వారిభ
నలందుకొని శ్రీవారిదేహమును పుష్పవిమానమునం గూర్చుండజేసి భేరీమృద
మంగళవాద్యములచేతను, ఛత్రచామరతోరణాద్యలంకారములచేతను సన్నిహి
ద్రిప్పి గ్రహస్థులచే భక్తిపూర్వకముగా సమర్పింపబడిన ధూపదీపనైవేద్యము
నారాధింపుచు బ్రహ్మోత్సవంబు జేసి శ్రీవారియర్ధాంగలక్ష్మీదేహమును సమాధి
బడినస్థలమునందు వారశిష్యునిచే వేయబడి వృద్ధిపొందియున్న వటావృక్షమునిగు
సమాధిచేయబడిరి.

శ్లో॥ సర్వకర్మాణ్యపిసదా కుర్వాణో మద్వ్యపాశ్రయః।
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతంపదమవ్యయం॥

ను [illegible] పునఃప్రతిష్ఠాగము. కొతరిం
ముప్పదిసంవత్సరములు ధొరతనమువారియుద్యోగమందు సత్యమే నిత్యమని
ంచి

శ్లో॥ మాతాపితాచసుప్రీతౌ శ్యాతాంపుత్రగుణైర్యది।
స్సపుత్రస్సకలంధర్మో ప్రాప్నుయాత్తేనకర్మణా॥

ల తల్లిదండ్రుల నానందపరచుటయే సర్వసుకృతమని తమస్వకాయకష్టమును ండ్రులకుపచరించుటకొరకే వినియోగపరచి వారు పరలోకప్రాప్తులు కావేగమే ంచవ్యవహారికమును విడచి సంకల్పశూన్యులై తండ్రిగారు పాలించిన జ్ఞానరా నందు ప్రవేశించి శ్రీస్వాములవారియుపదేశవిషయములను సుబోధకంబుగా ప్రతులు వ్రాసి తమభక్తులకు ప్రేమాస్పదంబుగా దయజేసిరి. అందు నీ ప్రథమ నను గురుబోధను శిల్పవిద్యాభివర్ధనీసమాజమువారు జూచి ముద్రితంబై ప్రచు డిన ఆస్తికజనానుకూలంబై మహోపకారిగా యుండునని యెంచి నీ దివ్య ము శ్రీస్వాములవారిజ్ఞానోపదేశముగా నుండినందున శ్రీవీరయోగీంద్రజ్ఞానోప ని పేరిడి ముద్రింపించ బూనుకొనిరి గనుక నిది పంచాక్షరీమంత్రవర్ణక్రమం పంచభాగములుగ వెలువడనై యున్నది. ఈ ప్రథమభాగము నకారవర్ణధ్యాన కముగా ప్రచురింపబడినది గావున ధీరులైన భాగవతోత్తములు నీ సుధామృత [illegible]వి సంతుష్టాంతరంగు లగుదురుగాక. తదుపరి శ్రీకొత్తుర్తి - సర్వాచార్య [illegible]విరచితంబగు ప్రపంచచారిత్రమను అపూర్వగ్రంథము అజ్ఞానందచ్ఛేద సూర్యదీప్తిగా ప్రచురింపబడనై యున్నది. ఇంక నిత్యాదివ్రాతపుస్తకములను [illegible]చించినమట్టుకు లేక మహనియ్యులైనవారు దయచేయించినమట్టుకు ముద్రింపించి స్తరింపజేయడమం దీ సమాజమువారు బూనుకొనియున్నారని నిందుమూలముగ స్తజనులకు విజ్ఞాపింపబడుచున్నది. శ్రీప్రపంచచరిత్రసారాంశము నీ భాగము రను వివరింపబడియున్నది.

శ్లో॥ ఆపన్నో స్మిశరణ్యో స్మి సర్వావస్థో స్మిసర్వదా।
భగవంత్వాంప్రపన్నో స్మి రక్షమాంశరణాగతమ్॥

---

త్సరముల్ త్రందట తమయర్ధాంగలక్ష్మి ... గా తమయసాఘ
ప్రక... శేయు శతవత్సరజీన... త్, పూర్ణి...; "మాసానాం మార్గశీ

ఓం

శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః.

శ్లో॥ నానాజనౌవ్యాధివినాశాయ నానాధిలోకాయజగద్ధితాయ।
నానాదివిజ్ఞానసుదర్శితాయ తస్మిన్నకారాయనమశ్శివాయ॥

గు రు బో ధ.

# ఛాయాపురుషయోగము.

మనుష్యసంచారము లేనట్టి యేకాంతస్థలమునకు పోయి తన పృష్టభాగ[ము] సూర్యుడుండునట్లు కూర్చుండి తననీడలో కంఠదేశమందు ఏకాగ్రదృష్టిచే జూ[చి] ధ్యానింపుచుండవలయును.

మంత్రము :—ఓం హ్రీం పరబ్రహ్మణేనమః. తర్వాత కొంతకాలము ఛా[యను] తట్టు చూచి ధ్యానించినపిమ్మట ఆకాశమును జూచిన గుహాదృష్టికి గోచర[మగు] అనంతరము పైని జెప్పినమంత్రమును నూటయెనిమిదిమార్లు ఉచ్చరించిన[...] జూడవచ్చును.

శుద్ధస్ఫటికమువంటి తేజస్సుతో జ్వలింపుచు నానారూపములను ధరించి[న] సాంబమూర్తిని నారుమాసంబులు ధ్యానము జేసినయెడల నామనుష్యుడు ప్రాణ[...] పతియగును. ముందు జెప్పినటుల రెండుసంవత్సరంబులు అభ్యసించినయెడల త[...] తట సంహరించువాడుగను, రక్షించువాడుగను, కాలత్రయమును తెలిసినవా[డు] ఆనందమును పొందినవాడై యుండును. ఏమనుజుడు నిరంతరము నిటుల యో[గా]భ్యాసము జేయుటచే వానికి త్రైలోక్యమం దేదియు దుర్లభముగ నుండదు. మరి[యు] ఆ స్వచ్ఛాకాశమందు చ్ఛాయాపురుషశరీరము కృష్ణవర్ణముగ గనబడినట్టయితే నా[రు] మాసములకు మృతినొందును.

ఛాయాపురుషుడు పసపువర్ణముగ కనబడెనేని రోగభయమనియు, రక్తవర్ణముగ లేక నీలవర్ణముగ కనబడెనేని మృత్యువును, నానావిధమయిన వర్ణములుగా కనబడెనేని చిత్తమునకు మిక్కిలి యుద్రేకము కలుగును.

ఏ మనుజునియొక్క దృష్టికి ఛాయాపురుషుని పాదములు, మోకాళ్లు, కడుపు ఇవి గనపడకపోయెనేని ఆ మనుజుడు ఆరునెలలకును, సంవత్సరమునకును, రెండు సంవత్సరములకును క్రమముగా మృతినొందును.

ఛాయాపురుషుని కుడిభుజము నెవనికి కనబడకపోవునో అట్టివానికి బంధువు మృతినొందును. ఎడమభుజము నెవనికి కనబడకపోవునో వానిభార్యా మృతినొందును. ఇందుకు సందేహము లేదు.

ఎవనికి ఛాయాపురుషునియొక్క శిరస్సు, కుడిభుజము కనబడలేదో ఆ పురుషుడు ఆసన్నమృత్యువు జెందువాడని యెరుంగవలెను. తల కనబడకపోయెనేని యొకమాసమునకు మృతినొందును. పిక్కలు కనబడనియెడల యొకదినములోనే మృతుడగును. మెడ లేనట్లు తోచినయెడల యెనిమిదిదినములలో మృతుడగును. సర్వాంగముయొక్క ఛాయనే కనబడకపోయెనేని తత్క్షణమే మృతినొందును.

# స్వరచింతామణి.

ఎడమముక్కు శ్వాసము చంద్రస్వరము. కుడిముక్కు శ్వాసము సూర్యస్వరము. రెండుపుటములనుండి యేకకాలమున వెడలెడిశ్వాసము అగ్నిస్వరము. ఇది పై రెంటికి నాధారంబై కామరూపమును ధరించి వృద్ధిజేయును.

ఎడమనాడిచంద్రుడు దీనికి ఈడ అని పేరు. ఇది స్థిరము. దక్షిణనాడి సూర్యుడు దీనికి పింగళ యని పేరు. ఇది చరము. సుషుమ్నానాడి యీ రెంటికి నడుమ శివరూపముచే నుండును. ఈ సుషుమ్న ఉభయమనబడును.

వామనాడిగాని దక్షిణనాడిగాని శైత్యముగా క్రిందుగా బారినచంద్రు డన బడును. వేడిగా పొడవుగా నడచిన సూర్యుడనబడును. ఇది రహస్యము.

చంద్రనాడిగాని సూర్యనాడిగాని అతిశైత్యముగా కొట్టినపుడు సకలకార్య ములను మనుష్యుడు సులభముగా సాధించును.

సూర్యస్వరము వచ్చువేళ చంద్రస్వర ముదయించినను, చంద్రస్వరము వచ్చు వేళ సూర్యస్వర ముదయించినను నిరుద్యోగము, మహాహాని, మనసునకు తాపము మొదలగునవి గలుగును.

త్రోవను నడచునప్పుడు రెండుత్రోవలుండి సందేహముండినయెడల స్వరమును బరీక్షించి శూన్యభాగమును విడచి పూర్ణభాగముత్రోవను బోవ ఆ మార్గము నిశ్చయ మగును.

ఆది, మంగళ, గురువారములు సూర్యస్వరములు. సోమ, బుధ, శుక్రవార ములు చంద్రస్వరములు.

శనివారము నపుంసకమై సూర్యచంద్రస్వరూపమై యుండును. అందువలన పగలు సూర్యుడు, రాత్రి చంద్రుడును నడచును.

నిద్రవచ్చినపుడే నాడి నడచుచుండునో ఆ నాడియందు శయనించవలెను, నిద్రలేచునపుడే నాడి యుండునో యా నాడియందు లేవవలయును,

సుప్తికాలస్వరము మృత్యువనబడును. బోధకాలస్వరము శుభమనబడును. కావున సుప్తిబోధకాలములయందు ఏకస్వరముగాక భిన్నస్వరమైన కార్యసిద్ధి యగును.

ఆదివారమున సూర్యస్వరము ఉషఃకాలమందును, సోమవారమునందు చంద్రస్వరమే ఉదయకాలమునందును నడచిన నన్నియెడల సంపదగలుగును.

సూర్యనివారమందు సూర్యస్వరమును, చంద్రునివారమందు చంద్రస్వరమును, సాయంకాలమందును, రాత్రి నిద్రకాలమందును కనిపెట్టవలయును.

వారస్వరము స్థిరమై నడచుచుండిన వారమునందు తలచినకార్యము సిద్ధించును. ఇతరస్వరము నడచిన నాకార్యము మరియొకప్పుడగును.

సోమవారము చంద్రస్వరమును, ఆదివారము సూర్యస్వరమును యీరీతి నుండిన జీవస్వరములనబడును. విపరీతమగు నెడల మృత్యుస్వరమగును.

ఏవారమం దేస్వరమో ఆ స్వరము దివారాత్రుల్లుండిన శుభకార్యములకు అశుభము అశుభమునకు శుభమని తెలియవలయును.

సోమవారము సూర్యనాడి సూర్యవారమున సోమనాడిగా నుండిన ఆదినమశుభము. మరియు రోగము, హానియు గలుగును.

సోమవారము రాత్రి సూర్యస్వరమును, భానువారముదయకాలమున సోమస్వరమును నడచిన మధ్యమఫలమగును.

ఆదివారము రాత్రి సుప్తికాలమున చంద్రస్వరమును, సోమవారముదయమున భానుస్వరమును యైనయెడల మృత్యువని తెలియవలయును.

పక్షమునకు మూడుదినములు, మాసమున కైదుదినములని చూడవలయు.

శుక్లపక్షపాడ్యమీమొదలు మూడుదినములు చంద్రుడు, మూడుదినములు సూర్యుడు. కృష్ణపక్షపాడ్యమీమొదలు మూడుదినములు సూర్యుడు, మూడుదినములు చంద్రుడు. ఈరీతిని వరుసగా ఒకొక్కస్వరము మూడేసిదినములవంతున నడచును.

దినము ఒకటింటికి ఐదుదినములబలము, దినములు మూడింటికి పదిహేను దినములబలము గలిగియుండును. స్వరము లేనిదినమున ఐదుబలములు నిష్ఫలములు.

శుక్లపక్షపాడ్యమీ మొదలు ఐదుదినములు చంద్రస్వరము కనిపించిన ఆనెల యుత్తమబలము.

మాసము మొదలు ఐదుదినములు, దినము ఒక్కటింటికి ఆరుబలములు, పక్షమునకును ఆ మాసబలములు జెప్పవలయును.

సంవత్సరమునకు యెనిమిదిదినములు, ఐనమున కైదుదినములు, పక్షమునకు మూడుదినములు, వారమున కొకదినము. ఇట్లు స్వరబలము నెరుగవలయు.

అమావాస్యయొక్క ఆదియు, చతుర్దశియొక్క అంతమును వీనిమధ్యకాలము సంధియని చెప్పబడును. దానియందు స్వరము నష్టమైనయెడల ఫలము నష్టమగును. శుభమైనయెడల శుభమగును.

ఆకాశము సూర్యచంద్రులు లేకుండిన నష్టమైన భంగిస్వరములేని సంధియు నష్టమగును. కావున సంవత్సరాదిబలములకంటె సంధిబలము ముఖ్యము.

చతుర్దశి అంత్యమున చంద్రుడును, అమావాస్య ఆదియందు సూర్యుడును నడచెనేని వానికి ఆ సంవత్సరమువరకు ఆయుఃవు సంపూర్ణము. వ్యత్యాసముగ నుండిన హాని, మృత్యువును గలుగును.

సంవత్సరాంతమందలి యమావాస్య మొదలుకొని మూడుదినములు రాత్రి నిద్రించువేళ సూర్యస్వరమును, ఉదయమున లేచునేళ చంద్రస్వరమును గనవలయును. అటుతర్వాత ఐదుదినములు, పిమ్మట యెనిమిదిదినములవరకు వారస్వరమును పరీక్షించవలయును.

సంవత్సరాది విదియనాడు చంద్రోదయకాలమున మనుష్యునిదేహమునందు చంద్రస్వరముండిన వానికి ఆ సంవత్సరమంతయు ఆయువు దృఢము.

ఈ సంవత్సరాది క్రమముగ చంద్రస్వరము కనబడినవారికి ఆయువు సంపూర్ణముగ నుండును.

పాడ్యమినాడు స్వరము తప్పిన కలహము, విదియయందు దగ్ధనాశనము, తదియయందు ప్రయాసము, చవితియందు మిత్రబాంధవులకు హానియు గలుగును. పంచమియందు స్వరము లేకుండిన దేశనాశము, షష్ఠియందు దేశాధిపతికి హాని, సప్తమియందు మహావ్యాధి, అష్టమియందు మృత్యువు గలుగును.

సూర్యస్వరమునందు అత్యుష్ణము, అతిశైత్యముగాని వస్తువుల భుజింప నెట్టి రోగములును అంటవు.

అధిక పులుసు అన్నమును విడచి బెల్లపన్నమును, పాలన్నమును, నేయి, చక్కెర కలిపిన అన్నమును భుజించిన శీఘ్రముగా జీర్ణమగును. దేహారోగ్యము గలుగును,

మొదట ఆద్యముతో గూడిన మధురవస్తువులు, మధ్యమందు తీపు పులుసు వస్తువులు, కడపట చేదు వగరుపదార్థములు భుజించిన దేహమునకు సత్వము వచ్చును.

సూర్యస్వరము నడచువేళ ఉష్ణమైనపదార్థములను, ఉప్పు పులుసు గూడిన పదార్థములును భుజించిన పిత్త మధికమగును.

చంద్రస్వరమునందు చాలా సేపు అత్యుష్ణవస్తువులు భుజించిన జీర్ణమునకు వచ్చి దేహారోగ్యము గలుగును. చేదు, పులుసు, ఉప్పు, కారము గలకూరలను దినవలయును. అతిశైత్యములగు వస్తువులను భుజింప దగదు.

చంద్రస్వరమందు చద్దినీళ్లతో గూడిన యన్నమును భుజించిన వాతశ్లేష్మరోగములు ప్రకోపించును.

నడచుచున్న సూర్యనాడిని నిలిపి చంద్రనాడి వచ్చునట్లు జేసిన విషమెక్కిన వానికి విషము దిగి స్వస్థమగును.

చంద్రస్వరమునందు కస్తూరికాచులతో గూడిన తాంబూలమును చేసిన సకలరోగములు మానును.

సూర్యస్వరమునందు విశేషముగా తాంబూలము జేసిన రక్తపిత్తమూత్రరోగములు గలుగును.

సూర్యస్వరమునందు కర్పూరమును విశేషముగా జేర్చి కొంచెముగా విడెము సేయ దేహమున కారోగ్యము గలుగును.

## వారఫలము.

సూర్యునివారమందు సూర్యుడును, చంద్రునివారమందు చంద్రుడును నడచితే జయమగును.

సూర్యునివారమందు చంద్రుడును, చంద్రునివారమందు సూర్యుడును నడచిన అపజయమును, రోగభయము.

సూర్యునివారమందు చంద్రుడు నడచితే తూర్పుదిక్కుగాని, దక్షిణదిక్కుగాని ఎడమకాలు ముందరగా మూడడుగులు నడచితే ఆ దోషము పరిహారమగును. సూర్యునిబలమిచ్చును.

చంద్రునివారమందు సూర్యుడు నడచితే పడమరదిక్కుగాని, ఉత్తరదిక్కుగాని కుడికాలు ముందుగా మూడడుగులు నడచితే ఆ దోషము పరిహారమగును. చంద్రబలమిచ్చును.

ఏవారమందైనా రెండునాడులు సమముగా నడచితే సుఖదుఃఖములు సమము.

ఏరోజునైనా ఉదయకాలమందు రెండునాడులు నడవకయుంటే ఆ దినము మహాహాని.

భోజనముచేసేటప్పుడు సూర్యనాడి నడచిన ఉష్ణపదార్థములు కూడదు. చంద్రనాడి నడచిన అతిశీతలపదార్థములు కూడదు.

సూర్యనాడియందు తాంబూలము చేసితే కర్పూరం, యాలకులు, లవంగాలు విస్తరించి వేసుకొనవలయును.

చంద్రనాడియందు కస్తూజాజికాయ గోరోజనం విస్తరించి వేసుకొనవలయును.

శుభకార్యములకు సూర్యనాడి మంచిదికాదు. చంద్రనాడి మంచిది.

చంద్రస్వరముగాని సూర్యస్వరముగాని తీవ్రముగా నడచిన, బుస్సుకొట్టి నడచిన, వణకుచు నడచిన అనేకవిధములైన రోగములు పుట్టును.

సూర్యస్వరం శంభురూపం. చంద్రనాడి శక్తిరూపం.

ఒకరాత్రి పగలకు ౬౦ ఘడియలు, చంద్రనాడి ౫ ఘడియలు, సూర్యనాడి ౫ ఘడియలు. ఈ చొప్పున బండిరేకులవలె తిరుగుతూయుండును.

౨౧,౬౦౦ హంసలైతే ఒక అహోరాత్ర. అనగా సూర్యోదయము మొదలుకొని మరుచటి సూర్యోదయమువరకు.

## పక్షఫలము.

శుద్ధ పాడ్యమీనాడు అనగా అమావాస్య వెళ్లిన పాడ్యమీ ఉదయం చంద్రుడు నడచిన పౌర్ణమీపర్యంతము జయము.

బహుళ పాడ్యమీనాడు అనగా పౌర్ణమీ వెళ్లిన పాడ్యమీనాడు సూర్యుడు నడచితే ముందర అమావాస్యపర్యంతము జయము.

## మాసఫలము.

నెలనెలకు అమావాస్య వెళ్లిన పాడ్యమి, విదెయ, తదియ ఈ మూడుదినములు చంద్రుడు నడచిన ముందర అమావాస్యపర్యంతము జయం. లాభం. ఈ మూడుదినములు చంద్రుడు లేకపోతే హాని. ఇందుకు సూర్యునిదిక్కు మూడడుగులు నడచితే ఆ దోషము పరిహారమగును. చంద్రబలమిచ్చును.

## సంక్రమాణఫలము.

సంక్రాంతినం డుదయకాలమున చంద్రస్వరము నడచితే వచ్చే సంక్రాంతి వరకు చంద్రబలమే ప్రధానము.

## సంవత్సరఫలము.

సంవత్సరాది పాడ్యమి అనగా చైత్రశుద్ధ పాడ్యమీ మొదలుకొని అంర్వాతి మూడుదినములు చంద్రుడు లేక పోయెనా, వారస్వరము లేక పోయెనా తాను ముందర సంవత్సరం చూచేదిలేదు.

చైత్రశుద్ధ పాడ్యమి, విదియ, తదియ ఈ మూడుదినములు సూర్యోదయకాలమందు నిద్రబోయి లేవగానే చంద్రనాడి నడచిన ఆ సంవత్సరము లెస్సగా బోవును. శుభభావములు గలిగియుండును. నిరోగమయిన ఆయువు గలిగియుండును. ఒక్కొక దివసమునకు నాలుగునెలల బలమిచ్చును. ఈ 3 దినములలో యేదినము సూర్యోదయ కాలమున చంద్రస్వరము లేకుండిన నా నాలుగునెలలు బలహాని, రోగభయం.

## సంవత్సరఫలములు.

| తిథి. | స్వరం. | ఫలములు. |
|---|---|---|
| చతుర్దశీ అంత్యమున. | చంద్రుడు. | నడచిన ఆయువు సంపూర్ణము. వ్యత్యాసముగ నుండిన హాని. |
| అమావాస్య ఆదియందు. | సూర్యుడు. | మృత్యువును గలుగును. |
| | | జ్ఞాపిక. అమావాస్య మొదలుకొని మూడుదినములు రాత్రి నిద్రించువేళ సూర్యస్వరమును, యుదయమున లేచువేళ చంద్రస్వరమును గనవలయును. |
| చైత్రశుద్ధ పాడ్యమి. | చంద్రుడు. | తప్పిన. మొదట 4 నెలలు హాని, భయం, కలహం. |

| తిథి. | స్వరం. | ఫలములు. |
|---|---|---|
| విదియ. | చంద్రుడు. | తప్పిన. ధననష్టం, చుట్టాలకు భయం.<br>జ్ఞాపిక. చంద్రోదయకాలమున చంద్రస్వరము యుండిన ఆయువు దృఢము. |
| తదియ. | చంద్రుడు. | తప్పిన. భయము, ప్రయాసము.<br>జ్ఞాపిక. చైత్రశుద్ధ పాడ్యమి, విదియ, తదియ ఈ 3 దినములు సూర్యోదయకాలమున చంద్రుడు లేకపోయినను, వారస్వరము లేకపోయినను తాను ముందరిసంవత్సరం చూచేదిలేదు. ఈ 3 దినములు సూర్యోదయకాలమునకు చంద్రనాడి నడచిన ఆ సంవత్సరము లెస్సగా బోవును. శుభభావము గలిగియుండును. నిర్రోగమైన ఆయువు కలిగి యుండును. ఒక్కొకదివసమునకు నాలుగునెలల బలమిచ్చును. ఈ 3 దినములలో యేదినము సూర్యోదయకాలమున చంద్రస్వరము లేకున్న ఆ నాలుగు నెలలు బలహాని, రోగభయము. |
| చౌతి. | వారస్వరం. | తప్పిన. బంధువైరం, మిత్రబాంధవులకు హాని. |
| పంచమి. | వారస్వరం. | తప్పిన. చెడు, అధికారవైరం, ధననష్టం, రాజునుండి భయం, దేశనాశనము. |
| షష్ఠి. | వారస్వరం. | తప్పిన. సంకటము, ఖేదం, దేశాధిపతికి హాని. |
| సప్తమి. | వారస్వరం. | తప్పిన. గమనం, మహారోగజారితుడగును. |
| అష్టమి. | వారస్వరం. | తప్పిన. కష్టం, దేహనష్టం, స్వయమరణభయం, మృత్యువు. |

| సూర్యుడు. | | | చంద్రుడు. | | |
|---|---|---|---|---|---|

## అయనములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉత్తరాయనము | ... | ... | దక్షిణాయనము | ... | ... |

## ఋతువులు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| గ్రీష్మఋతువు | ... | ... | వసంతఋతువు | ... | ... |
| శరదృతువు | ... | ... | వర్షఋతువు | ... | ... |
| శిశిరఋతువు | ... | ... | హేమంతఋతువు | ... | ... |

## మాసములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| వైశాఖము | ... | ... | చైత్రము | ... | ... |
| ఆషాఢము | ... | ... | జ్యేష్ఠము | ... | ... |
| భాద్రపదము | ... | ... | శ్రావణము | ... | ... |
| కార్తికము | ... | ... | ఆశ్వయుజము | ... | ... |
| పుష్యము | ... | ... | మార్గశీర్షము | .. | ... |
| ఫాల్గుణము | ... | ... | మాఘము | ... | ... |

## పక్షములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| శుక్లపక్షము | ... | ... | కృష్ణపక్షము | ... | ... |

## రాసులు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆరు రాసులు | ... | ... | ఆరు రాసులు | ... | ... |

## వారములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారం | ... | ... | సోమవారం | ... | ... |
| మంగళవారం | ... | ... | బుధవారం | ... | ... |
| గురువారం | ... | ... | శుక్రవారం | ... | ... |
| శనివారం పగలు | ... | ... | శనివారం రాత్రి | ... | ... |

| సూర్యుడు. | | | చంద్రుడు. | | |
|---|---|---|---|---|---|

## తిథులు

| | | | | | |
|---|---|---|---|---|---|
| శుద్ధ చౌతి | ... | ... | శుద్ధ పాడ్యమి | ... | ... |
| ,, పంచమి | ... | ... | ,, విదియ | ... | ... |
| ,, షష్ఠి | ... | ... | ,, తదియ | ... | .. |
| ,, దశమి | ... | ... | ,, సప్తమి | ... | ... |
| ,, ఏకాదశి | ... | ... | ,, అష్టమి | ... | ... |
| ,, ద్వాదశి | ... | ... | ,, నవమి | ... | ... |

## తిథులు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| బహుళ పాడ్యమి | ... | ... | శుద్ధ త్రయోదశి | ... | ... |
| ,, విదియ | ... | ... | ,, చతుర్దశి | ... | ... |
| ,, తదియ | ... | ... | ,, పౌర్ణమి | ... | ... |
| ,, సప్తమి | ... | ... | బహుళ చౌతి | ... | ... |
| ,, అష్టమి | ... | ... | ,, పంచమి | ... | ... |
| ,, నవమి | ... | ... | ,, షష్ఠి | ... | ... |
| ,, త్రయోదశి | ... | ... | ,, దశమి | ... | ... |
| ,, చతుర్దశి | ... | ... | ,, ఏకాదశి | ... | ... |
| ,, అమావాస్య | ... | ... | ,, ద్వాదశి | ... | ... |

## నక్షత్రములు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| పుబ్బ | ... | ... | 1 | అశ్వని | ... | ... | 1 |
| ఉత్తర | ... | ... | 2 | భరణి | ... | ... | 2 |
| హస్త | ... | ... | 3 | కృత్తిక | ... | ... | 3 |
| చిత్త | ... | ... | 4 | మృగశిర | ... | ... | 4 |
| స్వాతి | ... | ... | 5 | ఆర్ద్ర | ... | ... | 5 |
| విశాఖ | ... | ... | 6 | పునర్వసు | ... | ... | 6 |
| అనూరాధ | ... | ... | 7 | పుష్యమి | ... | ... | 7 |
| జ్యేష్ఠ | ... | ... | 8 | ఆశ్లేష | ... | ... | 8 |

సూర్యుడు. | చంద్రుడు.

## నక్షత్రములు.

| సూర్యుడు | | | | చంద్రుడు | | | |
|---|---|---|---|---|---|---|---|
| మూల | ... | ... | 9 | మఖ | ... | ... | 9 |
| రోహిణి | ... | ... | 10 | పూర్వాషాఢ | ... | ... | 10 |
| శతభిషము. | ... | ... | 11 | ఉత్తరాషాఢ | ... | ... | 11 |
| ఉత్తరాభాద్ర | | ... | 12 | శ్రవణం | ... | ... | 12 |
| | | | | ధనిష్ఠ | ... | ... | 13 |
| | | | | పూర్వాభాద్ర | | ... | 14 |
| | | | | రేవతి | ... | ... | 15 |

నక్షత్రస్వరము తప్పనయెడల సూర్యునియందు రోగము, చంద్రునియందు హానియు కలుగును.



| సూర్యఫలములు. | | | చంద్రఫలములు. | | |
|---|---|---|---|---|---|
| విద్యారంభము | ... | ... | స్థిరకర్మములు | ... | ... |
| దీక్ష | ... | ... | ఆనుకూల్యము | ... | ... |
| కొలువు | ... | ... | ప్రయాణము | ... | ... |
| వ్యాపారము | ... | ... | యుద్ధమునకు బోవుట | ... | ... |
| శస్త్రాభ్యాసము | ... | ... | శాంతికపౌష్టికములు | ... | ... |
| జూదము | ... | ... | ఉపనయనము | ... | ... |
| భేదము గలుగజేయుట | ... | ... | అర్థసంగ్రహము | ... | ... |
| దొంగిలించుట | ... | ... | గృహప్రవేశము | ... | ... |
| పల్లకి, గుఱ్ఱము, ఏనుగు వీని నెక్కుట... | | | రాజదర్శనము, విత్తులుచల్లుట | | ... |
| రథ, యంత్రాదిశిల్పములను వ్రాయుట. | | | దేవతాప్రతిష్ఠ, వివాహాది శుభకర్మములు. | | |
| సంగీతము | ... | ... | సంధి | ... | ... |
| చిత్రములు వ్రాయుట | ... | ... | వస్త్రాలంకారము | ... | ... |
| పాడుట | ... | ... | భూషణములు | ... | ... |
| యంత్రమంత్రాదిసాధనము | | ... | యోగాభ్యాసకార్యము | ... | ... |
| రక్షాబంధనము | ... | ... | ఔషధ లేహ్యతైల చూర్ణములు | | ... |

| సూర్యఫలములు. | | చంద్రఫలములు. | |
|---|---|---|---|
| బాహుయుద్ధము | ... ... | విషచికిత్స | ... ... |
| వైద్యము నభ్యసించుట | ... ... | జ్వరదోష మూర్ఛాచికిత్స | ... |
| సుందర స్త్రీలతో ప్రసంగం | ... | సజ్జనభాషణము | ... ... |
| సకలవస్తు విక్రయము చేయుట | ... | వీణామృదంగాదుల నేర్చేటందుకు | ... |
| స్నానము | ... ... | గురుసేవచేసేటందుకు | ... ... |
| భోజనము, స్త్రీసంగమము | ... | ఉపదేశమయ్యేటందుకు | ... ... |
| ఉదారత్వము, దానము | ... ... | బత్తీసు ఆయుధములు నేర్చేటందుకు | ... |
| ధర్మము, మారణము | ... ... | బావులు, చెరువులు త్రవ్వించేటందుకు. | |
| ఉచ్చాటనము, మోహనము, స్తంభనము | ... ... | రత్నాలు, సొమ్ములు, మిద్దెలు చేయించేటందుకు | ... |
| ఒకరితో కలహము, దూరయాత్రలకు | ... ... | వాటియందు ప్రవేశించేటందుకు | ... |
| అసాధ్య కార్యసాధనములకు | ... | దూరదేశము పోయేటందుకు | ... |
| తపస్సుకు, చెరమాడుట, చెరువయుద్ధమునకు | ... ... | దూరమందు యుద్ధమునకు | ... |

ప్రయాణమందలి సూర్యస్వరమాడుచుండిన వాడు కుడికాలు ముందుపెట్టి నడువవలసినది. చంద్రస్వరమాడుచుండెనేని ఎడమకాలును ముందుబెట్టి నడువ వలసినది.

## తత్వప్రకరణము.

ఈ దేహము పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము అనెడి పంచ భూతముల స్వరూపము.

ఆ భూతములయొక్క వర్ణము, గతి, స్వాదు, మండలము, స్థానకము వీనియొక్క కార్యాకార్య విచారము. ఇవి దెలిసినవాడు సమర్థుడై భువిని బాగుగ సంచరించును.

చంద్రస్వరమునందు మొదటిగడియ భూమితత్త్వము, రెండవది జలతత్త్వము, మూడవది తేజస్తత్త్వము, నాలవది వాయుతత్త్వము, ఐదవది ఆకాశతత్త్వము.

చంద్రస్వరమున పృథివీతత్త్వమునకు బుధుడు, జలమునకు చంద్రుడు, తేజస్సునకు శుక్రుడు, వాయువునకు బృహస్పతి, ఆకాశమునకు కేతువును అధిపతులు.

సూర్యనాడియందు మొదటిగడియ వాయువు, రెండవది తేజస్సు, మూడవది భూమి, నాలవది జలము, ఐదవది ఆకాశము.

సూర్యస్వరమున పృథివికి సూర్యుడు, జలమునకు శని, తేజస్సునకు కుజుడు, వాయువునకు రాహువు, ఆకాశమునకు కేతువు అధిపతులు.

## పంచతత్త్వములను చూచెడి క్రమము.

గడ్డము, కొమ్ము వీనియందు ఒక యంగుళప్రమాణము దృష్టి నిలుపవలయు.

ఎడమముక్కు, కుడిముక్కు మధ్యమునుండి గడ్డమున సరిగా దృష్టిని నిలిపి చూచిన నది హనుమంతనాడి.

ముక్కు నడుమ పృథ్వి, దిగువను అప్పు, మీద తేజస్సు, అడ్డముగ వాయువు, ముక్కును అంటి అంటక ఆకాశము సంచరించును. ఇది హనుమంతినాడీ క్రమము.

## పృథివీతత్త్వము.

కొంచెము ఉష్ణము. స్థిరమైన గుణముగలది శూద్రజాతి, పసుపు, తెలుపు కలసిన ఛాయకలదై నాలుగుమూలలును ౧౨ అంగుళములు ప్రమాణమునుగలదై నాసికామధ్యమున నడచుచుండును. ఈ తత్త్వమున కృషికర్మములు చేయ సిద్ధించును. స్థిరమైనకార్యములు, శుభకార్యములు, దుర్గములు, ఇండ్లు, మేడలు, ఉప్పరిగెలు, ఉద్యానములు చేయ శుభము గలుగును. యుద్ధకాలమునందు రాజుకు పృథివీతత్త్వమైన జయము సిద్ధము. వచ్చెడి పగవానికి భయము, భంగమును. స్థలమందున్నవానికి జయమును గలుగును.

## అప్పుతత్త్వము.

అతిశైత్యము గలది. వైశ్యజాతి, అర్ధచంద్రాకృతి, తెలుపువర్ణము, వగరుగలదై [illegible] అంగుళములు ప్రమాణముగలిగి ముక్కుక్రింద నంటి చరించును. దీనియందు శాంతికర్మములు చేయందగును. ఈ తత్త్వము నడచువేళ ప్రశ్న చేయ శుభము గలుగును,

మనస్సున చింతించిన సకలకార్యములును అగును. వివాహమునందు మంగళకరము, యాత్రయందును, పట్టబంధమునందును జయము నిచ్చును. నడబావి, గుంటలు, చెరువులు, కూటము, పూలతోటలు, ఇండ్లు వీనినికట్టించుట మొదలగుకార్యములను ఈ తత్వమున సేయ శుభము. మనుష్యులయొక్క అభిషేకమునందును, పట్టణగ్రామముల యందు బ్రవేశించుటకును, ఓడ యెక్కి దీవులకు బోవను, యుద్ధమందును, విత్తులు చల్లుటకును ఇత్యాదికార్యములకు ఈతత్వము శుభము. దేవతాప్రతిష్ఠ, యజ్ఞము, శాంతికపౌష్టికములు, స్త్రీసంగమము ఈ కార్యములు నీతత్వమునందు జేయవలయు.

## అగ్నితత్వము.

మిక్కిలి యుష్ణము. క్షత్రియజాతి, త్రికోణము, రక్తవర్ణము (స్వాదు) కారము గలదై ౪ అంగుళముల ప్రమాణముగలిగి ముక్కుపైన సంచరించును. ఇందు శ్రౌత కర్మములు చేయందగు. ఈ తత్వమున శుభకార్యములకు హాని, మరణము, వ్యాధి కలుగును. కార్యములు చెడును, విత్తులు మొలవవు, వివాహము చేయ విధవయగును, మృతినొందును. బావులు, గుంటలు, చెరువులు త్రవ్విన నీళ్లూరవు. యుద్ధము సేయ మృతిగలుగును. యాత్ర సేయ తిరిగీ రానేరడు. కొంచెము శుభకర్మములు చేసినను చెడును.

## వాయుతత్వము.

కొంచెము శైత్యముగలది. మిశ్రజాతి, పులుసు, షట్కోణమండలము నీల వర్ణముగలదై ౮ అంగుళముల ప్రమాణముగలదై ముక్కులో నడ్డముగ సంచరించును. ఇది పరుగిడి చేయదగినకార్యములకు మంచిది. ఈ తత్వమందు ప్రాణము సంచరించు నపుడు చరములగు సకలకార్యములను చేయదగినవి. నూతనముగా నెక్కెడి పల్లకీలు, మంచిబండ్లు, ఎద్దులు, గుఱ్ఱములు, ఒంటెలు, ఏనుగులు మొదలయినవాహనముల నెక్కుట కీతత్వము మంచిది. ఉచ్చాటనము, మోహనము, విద్వేషణము, ఆకర్షణము, యుద్ధయాత్ర వివాహము ఈ కార్యము లీతత్వమున సిద్ధింపవు.

## ఆకాశతత్వము.

దేవజాతి. ప్రమాణము, ఆకారము, రసము లేనిదై ముక్కులోపల సంచరించును. ఇందు జపధ్యానములు జేసిన ఫలించును. సకలతత్వములకును సమానమయిన ఈ తత్వము అకల్పమైన ఈశ్వరస్వరూపముగుటచే శుభాశుభములు, లాభనష్టములు లేనిదిగ నుండును. దృఢచిత్తులగు రోగిజనులయొక్క రోగమునకు పరమయోగము

నిచ్చును. దేవపూజ, దానము, ప్రతిష్ఠ, మంత్రోపదేశము, తర్పణము నివి చేయ సిద్ధించును. మరియు నీతత్వమునందు మోక్షమార్గోపదేశము శిల్పిశాస్త్రము నభ్య సించుట. ఇవి సిద్ధించును.

## కాలజ్ఞానము.

మాసాదియందు సూర్యస్వరము నాలుగుజాములు అఖండముగా నడచిన వానికి మరణమని జెప్పవలయు. నాలుగుజాములు సూర్యస్వరము అతిభారమై నడచిన 4 సంవత్సరము లాయువు. ఒకదినము నడచిన 3 సంవత్సరములు. 2 దినములు నడచిన రెండుసంవత్సరములు. 3 దినములు నడచిన 6 నెలలు జీవితము. 4 దినములు నడచిన 4 నెలలు. 5 దినములు నడచిన 3 నెలలు ఆయువు. 10 దినములు నడచిన 1 నెల. 14 దినములు నడచిన ఒకపక్షమాయుష్యము. ఒక నెల నడచిన ఒకి దినము బ్రతుకును. చంద్రస్వర మతిభాగముగా 5 దినములు నడచిన ఒకసంవత్సరము రోగముతో బ్రతుకును. 15 దినములు చంద్రస్వర మెడతెగక నడచిన 6 నెలలవరకును, 20 దినములు నడచిన ఒక నెలవరకును వ్యాధిపీడ కలుగును. ఒకదినమంతియు విడువక చంద్రస్వరము నడచిన నాదినముననే మరణము గలుగును.

ఇట్లు సూర్యచంద్రులు అతిచారమును పొందినయెడల సూర్యునివలన మరణము. చంద్రునివలన వ్యాధిపీడ యని తెలియవలయును.

ఈరీతిని విఘ్నరూపముగా వచ్చెడికాలమును ఔషధసేవనము, దానములు, జపములు, హోమములు, శివపూజ (విత్తశాఠ్యము) మొదలగువానినే జేయింపవచ్చును. ఈ యపమృత్యువు తొలగును.

సూర్యనాడి ఒక యహోరాత్ర విడువక నడచిన రోగము విస్తరించిన నెల రోజులకు మరణం.

సూర్యనాడి 14 రోజులు ఏకతీరున రాత్రి పగలున్ను నడచిన 15-వ దినమున నిశ్చయముగా మరణం.

చంద్రనాడి రాత్రింబగలు 5 దినములు నడచిన ఆయేడాదికి మరణం. అధవా మహారోగజారితు డౌను. 10 దినములు నడచిన 6 నెలలకు మహాహానియున్ను విఘ్నములున్ను గలుగును. 20 దినములు నడచిన 3 నెలలకు మహాహానితో మరణం. [illegible] దినములు నడచిన 30 దవరోజున మరణం. ఇందుకు శాంతి దానధర్మములు, తపస్సులు, జపహోమసంతర్పణములు జేసిన నాదోష పరిహారమగును.

మ. వినుమాపింగళనాడి రెండు నెలలున్ విస్తీర్ణమైయాడినన్
అనుమానంబును లేక నారు నెలలుండా పైమృతుండౌగదా
వనిలో మాసము పక్షమున్ విడువకావశ్యంబు యీడాడినన్
తనువర్షాంతము మృత్యువందును సుమా తథ్యంబు ఓపార్వతీ.

క. పక్షంబు పింగళాడిన
రక్షణ లేకుండు మృతికి రా రాజు సుమా
తిక్షణము స్థంభనైనను
ఆక్షణంబైన రోగమా నరుడందున్.

సీ. పదిదినంబులు యీడ పట్టుగానడచిన
మూడు మాసములో ముక్తుడగును
మూడు మాసములీడ నాడుచున్న నునరుడు
మేడాదిలో దేహ జాడమరచు
సంవత్సరాదినీ చంద్రమాడక యున్న
హానినొందును మహాయద్భుతముగ
అష్టమి దినమిష్టనాడియు లేక
కష్టహా పైతుదకు నష్టమందు
విదియలో నాడి వెనకైన నేగుధనము
తదియ దినమీడ లేకున్న తట్టు భయము
నాలుగవనాడు వారంబు నడువకున్న
బంధు వైరంబు చేమహా బాధగల్గు.

క. పంచమి వార స్వరమును
చంచలమై లేకయున్న చెడ్డతనంబున్
మించిన రాజుతో వైరము
మొంచును ధననష్టమౌను యింతీ వినుమా.

తే. షష్ఠివారము లేకున్న సంకటంబు
నటులసప్తమివారంబునంటు లేక
నాడిపరమైనదేశాలనంటిదిరుగు
యీడపింగళనాళులీవిధినియుండు.

తే. భానుమంగళగురుస్థిరంభాస్కరునివి
దక్కనవిచంద్రవారముల్ తలపునెరుగు
వారములయందునాడులువరుస లేక
మారునడచినవారికిమారుతత్వమ్.

శుక్లపక్షంబున గురువాసరంబున నుదయకాలమందలి చంద్రస్వరం బభిముఖమ్ము గావలయు. కృష్ణపక్షంబున గురువారము ప్రాతఃకాలమందు సూర్యస్వరము నడువవలయు. భానువారమున చంద్రుడును, ఇందువారమున సూర్యుండు నివ్విధంబుగా నభిముఖం బయ్యేనేని మిక్కిలి భయం కలుగును. మరియు నేడువారములకు భేదంబుగా నభిముఖ మయ్యేనేని మరణమ్ము వాటిల్లును.

# యోగవిషయము.

యోగ మనగా ప్రత్యగాత్మకును, పరమాత్మకును, ఘటాకాశమహాకాశములకు వలె నైక్యసంబంధము గలుగుట అనగా మనస్సు ననేకరీతులుగా సంచరింపనీక తన యందే మగ్నము చేసికొనుట. ఇంద్రియములను వశపరచుకొనేచిత్తము నీశ్వరుని యందు లయింపజేయుటయే యోగము.

మనము దేనితో సమస్తపదార్థములను జూచుచుందుమో యట్టి నేత్రద్వయము యొక్క చూపునకు బహిర్వ్యాప్తిలేకుండ దనను దాను జూచుకొనుట, నేర్పిన నది వరకు గనపడువస్తువులెల్లను నగపడవు. దీనికే యంతర్ముఖవ్యాప్తి యని జెప్పుదురు. అట్లు చూపెచ్చట లీనమగునో యచ్చటనే మనస్సుసైతము లీనమగును. చూపును మనస్సు నెచ్చట లీనమగునో నచ్చటనే సోహస్స్వరూపముగనుండెడు వాయువును లీనమగును. అచ్చటనే మనోమారుతములు లయమవుచున్నవి.

యోగాభ్యాసము జేయ దలపుగలవారలు గుహలయందుగాని లేక జనసంచార మును, దుర్వాసనయు, నల్లులు, దోమలు, చీమలు, మిట్టపల్లములును లేక విశాలమై యుండు సమభూమియందు ఒత్తుకొనకయుండునట్లు పులిచర్మమునైన, కృష్ణాజినమునైన, దర్భాసనమునైన, వస్త్రమునైనను వేసికొని దానిమీద స్థిరచిత్తముతో పద్మాసనమున నడుము, మెడ, తల నిక్కించి యేతలంపునులేక గూర్చుండి యోగాభ్యాసము జేయ వలయును. కోపమును దూరముగా విడువవలయును. ఉప్పు కారము మొదలగు తామసపదార్థములను దినక పాలు, నేయి, చక్కెర మొదలుగాగల సాత్విక మధుర పదార్థములనే దినవలయును. మితహారమును మితనిద్రయు నుండవలయును. ప్రథమ ములో బద్మాసనము వేసికొని యొకగంటసేపు గదలక కూర్చుండియుండుట కభ్యాసము జేయవలయును.

## ఆహార వివరము.

| | |
|---|---|
| తేనె<br>పాలు<br>నెయ్యి<br>మినుములు<br>గోధుమలు<br>పెసలు. | ఇవి సాత్వికాహారములు. ఆయుర్వృద్ధిని, శరీరశక్తిని, ఆరోగ్యమును, సుఖమును, సప్తధాతువృద్ధిని, జ్ఞానమును గలిగించును. |

| | |
|---|---|
| కారము, పులుసు, ఉప్పు, క్షేడిమి, వగరు, చేదు చురుకు. | ఇవి రాజసాహారములు. కామ క్రోధాదులను ప్రబలజేయును. |

| | |
|---|---|
| జాములుగడచినది, రసహీనమైనది, దుర్గంధముగలది, చలిది ఎంగిలి, అపవిత్రతగల పదార్థములు. | తామసాహారము. |

భోజనానంతరము యోగాభ్యాసము చేయగిట్టదు. తెల్లవారుజామున నాలుగు గంటలవేళయే దీనికి ప్రశస్తమైనకాలము.

యోగములు నాల్గువిధములు :— 1 మంత్రయోగము, 2 లయయోగము, 3 హటయోగము, 4 రాజయోగము.

## మంత్రయోగము.

ధ్యానముద్ర :—పద్మాసనం వేసుకొని కన్నులు మూసి దృష్టి నాసికాగ్రమందు నిల్పి యిష్టదేవతను ధ్యానించుట.

## లయయోగము.

రాధాయంత్రము :—దిగువ నాసికము జూస్తూ తర్జనీ రెండువ్రేళ్లచేత రెండు చెవులరంధ్రములు మూసితే గజ్జలు, ఘంట, శంఖము, వీణ, తాళము, పిల్లనగ్రోవి, మద్దెల, భేరీమృదంగము, మేఘనాదము వినబడును. మేఘనాదమందు మనస్సు లీనమగును.

## హటయోగము.

షణ్ముఖీముద్ర :—చెవులు రెండు, కన్నులు రెండు, ముక్కురంధ్రములు రెండు మూసి వాయువును రేచకపూరకకుంభకాదులచేతను సాధించి సుషుమ్నద్వారా సహస్రారం చేర్చుట.

## రాజయోగము.

సాంఖ్యము, తారకము, అమనస్కమని మూడువిధములు : అందు,

## సాంఖ్యయోగము.

సంఖ్యయే సాంఖ్యము. సంఖ్య యనగా లెక్క. అనగా జ్ఞానేంద్రియకర్మేంద్రియప్రాణవిషయపంచకములును, అంతఃకరణచతుష్టయమును అనెడు చతుర్వింశతి

ములును ప్రకృతియనియును, పంచవింశతితత్వాత్మకు జీవుడనియును, షడ్వింశతత్వాత్మకుడు ఈశ్వరుడనియును, ఈ జీవేశ్వరసమ్మేళనమే సప్తవింశతితత్వాత్మకపరబ్రహ్మమనియును, ఆ పరబ్రహ్మమే నేనని యివ్విధముగా అనుసంధానము చేయుటయే సాంఖ్యయోగము.

## తారక యోగము.

పుట్టుటగిట్టుట లనెడి అలలుగల సంసారమను సముద్రమును దాటించునదియును, బ్రహ్మవిష్ణురుద్రాదులచేత పొగడదగినదియును, బ్రహ్మహత్యాదిమహాపాపములను నశింపజేయునదియును, కామక్రోధలోభమోహమదమత్సరడంభాదిదుర్గుణములను సంహరించునదియును, నేను జీవుడ ననెడి యజ్ఞానమును తొలగించునదియును, పరబ్రహ్మము నేననెడు దివ్యజ్ఞానమువలన గలిగెనని రతిశయానందమును వర్ధిల్లజేయునదియును, వేదముల కడపటిభాగమయిన జ్ఞానకాండనుచేత విచారింపదగినదియు తారకయోగము.

క. వరుసన్ ఖేచరియనభూచరియన
మధ్యమయనంగ షణ్ముఖియనగా
వరశాంభవియనగలవి
ధరలోపలముద్రలైదు తారకమనకున్.

తారకయోగమునకు ఖేచరీ, భూచరీ, మధ్యమ, షణ్ముఖీ, శాంభవి అనెడు పంచముద్రలు గలవు.

ఖేచరీముద్ర.

ఆ. కనులుమూసియైనగడువిచ్చియైన
భ్రూమధ్యమమునజూపుమలచినిలిపి
యూర్ధ్వముఖముగాగనొనరజూచిన
నదిఖేచరియనుముద్రకీశవర్య.

తా. కన్నులు మూసియైనను మూయకయైనను ఉండి చూపును త్రిప్పి కనుబొమల నడుమను నిలిపి మీదిదిక్కునసున్న చిదాకాశమును చూచుట ఖేచరీముద్ర.

భూచరీముద్ర.

క. లోచనములుగదలింపక
యాచార్యోక్తస్వనాసికాగ్రం జెపుడున్
గోచరముగజూచినదది
భూచరియనుముద్రయగునుబోధశరణ్యా.

తా. కన్నులను కదలింపక తన ముక్కు కొనను మనస్కవతో జూచుట భూచరీ ముద్ర.

మధ్యలక్ష్యముద్ర.

ఆ. కనులుసగముమూసిఘననాసికామధ్య
సీమయందుజూపుజెదరనీక
నిలిపిమీదనున్ననిటలంబుగాంచిన
మధ్యలక్ష్యమగుగుమారతిలకా.

తా. కన్నులు సగము మూసి ముక్కునడుమను గ్రుక్కన చూపులు నిలిపి మీద నున్న నుదురును కుదురుగ జూచుట మధ్యలక్ష్యముద్ర.

షణ్ముఖీముద్ర.

తే. కర్ణలోచననాసాయుగంబుమూసి
మలచిభ్రూమధ్యమమునజూపులనుమనమునిలిపి
వరనాదబిందుచిత్కళలగనుట
షణ్ముఖీముద్రయండ్రుసజ్జనులువత్స.

తా. చెవులను, కన్నులను, ముక్కులను మూసి బహిర్ముఖమైన దృష్టిని మనస్సును అంతర్ముఖము చేసి కనుబొమలనడుమ నిలిపి నాదబిందుకళలను జూచుట షణ్ముఖీముద్ర.

శాంభవీముద్ర.

శ్లో॥ అంతర్లక్ష్యంబహిర్దృష్టి ర్నిమేషోన్మేషవర్జితా।
ఏషాసాశాంభవీముద్రా సర్వతంత్రేషుగోపితా॥

క. అంతర్లక్ష్యబహిర
త్యంతవినిశ్చలసుదృష్టియపగతపవన
స్వాంతవికారముగలయది
వింతయగుచునొప్పశాంభవీముద్రయనన్.

తా. ప్రాణాదిదశవాయువులను మనస్సు మొదలయిన పదునాలుగింద్రియము
లను జయించి కన్నులను తెరచికొని చూపులను చిదాకాశమున నిలిపి
అక్కడివింతలను జక్కగ జూచి చొక్కుట శాంభవీముద్ర.

సీ. కనులురెండుతమముగదియమూయుచునరి
నాసికాగ్రమునందునాటుదృష్టి
నిల్పిననమవసనిజపదాంశంబండ్రు
లక్షణార్థముయీలక్ష్యమెరుగు
నమలనేత్రద్వయమర్ధాంశమిళితంబు
చూపుచేనొసలనుజూటిపరచి
పాటింపనీదృష్టిపాడ్యమిలక్ష్యంబు
లక్షణంబులెరుంగులక్షణముగ
నేత్రములుక్రిందుమీదుగానిక్కబెట్టి
చూపుభృయుగమందునసూటిపరచి
లలనయిటువంటిపూర్ణిమలక్ష్యమెరిగి
సలలితానందసంపత్ప్రసాదమొందు.

శాంభవీముద్రకు లక్ష్యములు మూడువిధములు: అనగా అమావాస్య, పాడ్యమి,
పౌర్ణమి, లక్ష్యములు.

## అమావాస్యలక్ష్యము.

కనులు మూసి నాసికాగ్రమందు దృష్టిని నిల్పుట.

## పాడ్యమిలక్ష్యము.

వెలుపల అగ్రభాగము నాసికాగ్రమం దగ్రభాగము దృష్టిని నిల్పుట.

## పౌర్ణమీలక్ష్యము.

నేత్రములు క్రిందుమీదుగా నిక్కబెట్టి నాసికాగ్రమందు దృష్టిని నిల్పుట.

ఉపవాసికిని, తిండిబోతుకు, నిద్రబోతుకు, నిద్రబోవనివానికి యోగలక్ష్యములు అగోచరములు.

మితభుక్తికి మితనిద్రయునకు యోగలక్ష్యములు గోచరము.

అంతర్లక్ష్యముచే పరమకళయందు మనస్సును చేర్చి రెండుజాములు నిష్ఠపలుపవలెను.

పంచముద్రలచే ఓంకారమందలి దశవిధనాదములను, చిద్బిందువును, చిత్కళను ఆలింప దర్శింపవచ్చును.

నాదబిందుకళలను దర్శించుటచే నిరతిశయానందము గలుగును.

నాదబిందుకళలను వీక్షించుటచే మనస్సు లయించి సచ్చిదానందనిత్యనిర్మలపరబ్రహ్మమై యుండును.

నాదబిందుకళ దర్శనములేక మనస్సు చాంచల్యము కట్టదు.

రాజయోగముచేతనే మానసేంద్రియములు వశముచేసుకొనబడును.

నాదబిందుకళలయొక్క అనుభవానందముచే మనస్సు వశమగును.

షణ్ముఖీముద్రచేత రెండుచెవులను మూసి ఆలింప ప్రణవదశవిధనాదములు మ్రోయును.

## దశవిధనాదములు.

చిణి, చిణిచిణి, ఘంట, శంఖ, వీణ, తాళ, వేణు, భేరి, మృదంగం, మేఘ నాదములు పది.

అ + ఉ + మ = ఓంకారము. హృదయమందు ఘంటానాదమువలె మ్రోయును.

హృదయమందు ఓంకారనాదమును వినక మనస్సు నిలువదు.

కనులు రెండు మూసి భ్రూమధ్యమందు దృష్టి నిల్పి చిత్కళలను చూడవలయు.

మనస్సునందే పంచాకాశములు గనవలయును.

## పంచాకాశములు.

హృదయాకాశంబునందు గుణరహితాకాశం, పరాకాశం, మహాకాశం, తత్వాకాశం, సూర్యాకాశం. ఇవి పంచాకాశములు అవలోకింపవలయును.

పంచాకాశములమధ్యను వెలింగెడి చిత్కళలను తెలియవలయును.

పంచాకాశమధ్యమందు చిత్కళలు పలువిధదీప్తులవలె ప్రకాశించును. అనగా మణికాంతులవలె, సూర్యకాంతులవలె ఘనమండలమువగిది.

భ్రూమధ్య ఉదయాచలముమీద జ్ఞానసూర్యు డుదయించి ఏమ్మట తానైయ్యె వెలుగును.

ఫాలమునను దృష్టిచే జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడు త్రిపురములను దహించి మోక్షస్వరూపు డౌను.

హృదయాకాశమధ్యమందు అగ్నిమండలము పుణ్యపాపమిశ్రకర్మములు భస్మము జేయును.

ప్రణవమాత్రముచే మనస్సంబంధములైన విషయములను దహించి బ్రహ్మానంద రసమును పానము చేయవలయును.

చంద్ర, సూర్య, అగ్ని త్రివిధమండలములకు ఉత్పత్తిస్థానమైన హిరణ్మయ మండలము దృశ్యమగును.

సూర్య, చంద్ర, అగ్నిమండలములవలె హిరణ్మయమండలము ప్రకాశించును.

హిరణ్మయమండలము ఆహోజ్యోతియై ప్రకాశించును.

మహాతేజస్సు భ్రూమధ్యముమీదుగ గనపడును.

భ్రూమధ్యయందు హృదయాకాశంబున గనుపించు వియన్మండల, తమో మండల, మేఘమండల, విద్యున్మండల, తారామండల, జ్యోతిర్మండల, సూర్యమండల,

చంద్రమండల, వహ్నిమండల, హిరణ్యమండలంబులను దశమండలంబులు దశవిధ నాదంబులు గని విని నిర్వికల్పనిష్టను బొందవలయు.

నిర్వికల్పనిష్టచే మనశ్చలన ముడుగక నిశ్చలనము గలుగదు.

హంసతత్వము తెలిసిన ప్రాణవాయువు, బుద్ధి, మనస్సు కదలకుండును.

హంసచక్రము మనస్సునకు పరబ్రహ్మమునందు కూటమిచేత శోభిల్లును—

స్థూలశరీరముయొక్కయు, ప్రాణవాయువుయొక్కయు, అగ్రభాగమందున్నట్టి బుద్ధియే బిందువు. బిందు వందు తేజరిల్లెడు పరమాత్మయొక్క ప్రతిఛాయియైన జీవుడే కళ. ప్రాణాదివాయువులయొక్క ధ్వనియే ఓంకారనాదము.

నాదబిందుకళలయందు గనబడెడి అభిమానియైన జీవుని కనుపురుషుడే పరబ్రహ్మము.

పద్మాసనస్థుడై చూపులు నిటలమందు నిల్పి ప్రణవనాదమును చిత్కళలను దర్శింపవలయు.

ప్రణవవాచ్యమైన పరబ్రహ్మము ఆధారచక్రము మొదలు సహస్రారచక్రము వరకు నిండియుండును.

నాదలయస్థానము సుషుమ్న దేశము.

ప్రాణవాయువు మనస్సు బ్రహ్మమం దైక్యమగును.

రేచకపూరకకుంభములచే మనస్సుతోడ జీవహంస సంచరించు.

ప్రణవాంగమైన జీవహంస మనోమారుతములతోడ చేరి ఆరుచక్రములయందు నహోరాత్రులందు ఇరువదియొక్కవేల యారునూరుమారులు సంచరించును.

ఉఛ్వాసనిశ్వాసవాయువులు కుడి యెడమనాడు లందు సంచరించును. మనస్సు వాయువులను జూచుచు సార్వకాలము మధ్యమార్గమగు సుషుమ్నానాళమును జెంది సంచరించును.

ఈడపింగళనాడులకు పరమై సుషుమ్నానాడినాళము దీపించును. అందు హంసుండను పరబ్రహ్మము ప్రకాశించును.

జీవ, ఈశ్వరులును పరబ్రహ్మమం దైక్యమగునప్పుడు తనరూపముగా జేయును.

జీవుడే బిందువు, జ్యోతే నాదము.

జీవశివసంగమే కళ.

కళ తానె తానై వెలిగెడి పరబ్రహ్మమందు ఐక్యమందును.

నాదబిందుకళ పరబ్రహ్మమందు మిళితము.

అఖండపరిపూర్ణసచ్చిదానందపరబ్రహ్మమై వెలుగుచునుట.

హంసనాదబిందుకళలతో మనఃప్రాణంబులయిందు గలయువస్థ తురీయ్యం బనియు, వృన్మనియనియు, అమనస్కంబనియు నిర్వికల్ప సమాధియవును.

తారకయోగసిద్ధి అనుదినము రెండుజాము లలవాటుజేసిన నిర్మలశ్చలచిత్తవృత్తి గల పురుషునకు ఆరుమాసములకు మందప్రజ్ఞునకు, సంవత్సరమునకు మూఢాత్మునకు, పన్నెండుసంవత్సరములకు సిద్ధించును.

## సమాధికి విఘ్నములు.

రోగము, బడలిక, సందేహము, అజాగ్రత, సోమరితనము, విషయలోలత్వము, తప్పభిప్రాయము, స్థిరములేమి, బాధ, హీనత్వము, జాడ్యము, ఆయాసము, దగ్గు మొదలుగాగలవి. ఇవి యున్నప్పుడు సమాధులు చేయుగిట్టదు. ముమ్ముందుగా ప్రతి బంధములను నివర్తిజేసికొని సమాధినిష్టలకు బోవలయును.

## చక్రవిషయము.

ప్రత్యక్షముగ గనబడెడి యీస్థూలదేహమందు మూలాధారమునుండి కపాలకుహరమువరకు వీణాదండమువలె నొక వెన్నెముక యుండును.

శరీరముయొక్క వెనకభాగమున వీణాదండమువలె శిరస్సుపర్యంతమును వెన్నెముక యున్నది. దానిని బ్రహ్మదండియని జెప్పుదురు.

వెన్నెముకమధ్యను గొట్టమువలె సూక్ష్మరూపముగనుండు రంధ్రమును బ్రహ్మనాడి యందురు. ఆనాడి ఈడపింగళనాడులకు మధ్యనుండినదై సుషుమ్న యను పేర బరగుచున్నది. ఈ సుషుమ్నయే బ్రహ్మాత్మైక్య ప్రతిపాదకమైనది గనుక బ్రహ్మనాడియని జెప్పుదురు. ఈ సుషుమ్న కంఠిగ్గతముగా కుండలినీ శక్తిగలదు.

ఈ వీణాదండమునకు వీణకు మెట్లువలెనే యొకటిమీద నొకటిగా ముప్పది మూడు పూసలుండును. అందు మొదటియేడిటినే మెడపూసలని కడమ నిరువదారిటిని వెన్నుబూసలని జెప్పుదురు. ఈ వెన్నెముకకే బ్రహ్మదండి. మేరువనను పేర్లు.

ఈ పూసలనడుమ నాళముండును. అదియే సుషుమ్నానాళము. ఈ నాళముగుండ సుషుమ్న అధోముఖముగ మూలాధారమునకు వచ్చి మనస్సును విషయములకు పోవునట్లు జేసి తాను తిరుగా యూర్ధ్వముఖముగా వ్యాపించుచు వెన్నుపూసలను మెడపూసలను దాటి పెద్దనాళముతో గలియును. ఈ పెద్దనాళమునకే బ్రహ్మరంధ్రమని పేరు. ఈ సుషుమ్న సర్పాకారముగా నున్నందున వెన్నుపామని జెప్పుదురు. ఈ సుషుమ్న కడుకోమలమైనదియు బహుమృదువైనదియును గావున నేయపాయమును గలుగకుండ శిరస్సునందలి కపాలకుహరమనెడి దట్టమైన యెముకలపెట్టెలో నిమడ్చబడి యతిజాగ్రత్తతో గాపాడవలసివచ్చెను. ఈ సుషుమ్న యుండెడుస్థానము బ్రహ్మరంధ్రము. ఇదియే ప్రాణాధారము.

శరీరమునందు ముఖ్యములైన నూరునాడులలో నొక్కొక్కదానికి నూరేసి శాఖానాడులును అందొక్కొక్క శాఖానాడికిని 72,000 సూక్ష్మనాడులు గలవు. నాడులనేకముగా గలవు. అందు ముఖ్యములగు పదింటిలో అతిముఖ్యమైనవి మూడు నాడులు : అనగా,

1. సుషుమ్న :—అతికోమలమును సుకుమారమునై యీడపింగళలను నాడులతో మూలాధారమునుండి యూర్ధ్వముఖముగా బోయి కుండలీశక్తి యను పేరుతో గపాలకుహరమున బ్రవేశించి యచటనుండి నాలుకకొనకు జేరి సరస్వతి యను పేరట బ్రసిద్ధమగుచున్నది. ఈ సుషుమ్న పశ్చిమాభిముఖమై భ్రూమధ్యమందు నీడపింగళనాడులతో గలసియుండును. ఆ స్థానమే త్రివేణిసంగమము, త్రికూటము, ఆజ్ఞాచక్రము నని జెప్పబడును. సుషుమ్న తెల్లనిరంగుగలది. గాన శుక్లనాడియని పరబ్రహ్మమునుగురించిన జ్ఞానమునకు సాధకము గావున బ్రహ్మనాడియనియును జెప్పబడును.

2. ఈడ :—ఎడమముక్కునుండి వాసనలను గ్రహించును. ఇదియే చంద్రనాడి. ఈ నాడి ముక్కునుండి కపాలముదనుక పోవును. గనుక వాసనలను గ్రహింపజేయును.

3. పింగళ :—కుడిముక్కునుండి వాసనలను గ్రహించును. ఇదియే సూర్యనాడి. ఈ నాడియు ముక్కునుండి కపాలముదనుక బోవును. గనుక నిదియు వాసనలను గ్రహింపజేయును. ఈ యీడపింగళనాడులు సుషుమ్నతోగూడ నాధారచక్రమునుండి యూర్ధ్వముఖముగా బోయి భ్రూమధ్యమందు జేరి గంగా యమునా

యను పేర్లుగలవి యగును. వీనివలననే ప్రాణవాయువునకు సంచారము గలుగును. గంగా యమునా సరస్వతులు గలియుస్థానము గనుక భ్రూమధ్యమునకు త్రివేణిసంగమ మను పేరు గలిగెను.

చెవులు, కన్నులు, ముక్కు, నాలుక వీనినుండి యేడునాడులు మేదస్సు (మెదడు) నందు సుషుమ్నతో గలియును. ఆస్థానమునే బ్రహ్మరంధ్రమనియు సప్త పథయనియుం జెప్పుదురు. అచ్చటనే సహస్రారముండును. శ్రోత్రచక్షుర్జిహ్వా ఘ్రాణములనుండి పోవునాడులు కలియుస్థానము గనుక దీనినే చతుష్పథమనియు, (శృంగాటక) మనియు జెప్పుదురు.

బ్రహ్మరంధ్రము :—భూపతన మైనతోడనే బిడ్డలకు నడనెత్తిని మృదువైనగుంట (భూపతన మైనది మొదలు బిడ్డలకు మాడున జమురుబెట్టి పసపురాచుట యాచారమని సర్వత్ర తెలిసినవిషయమే. ఇట్లు దినదినమును జమురు రాయరాయ నాగుంట పూడి కనబడకుండును. పండ్రెండుసంవత్సరములకు నెముకలన్నియు నతుకుకొని తల గట్టి పడును) యొకటి యుండును. ఆ గుంటకు దిగువతట్టున నొక కమలముండును. దీనికే సహస్రారకమల (ఈ కమలమునకే బ్రహ్మరంధ్రమనియు, ఈ కమలముయొక్క మధ్యనుండెడినాళమునకే సుషుమ్నానాళమనియుం బేరులు.) మని పేరు. శిశువు గర్భములో నున్నప్పుడు ఈ కమలము వికసించియుండును. ఆ కారణముననే గర్భము లోని బిడ్డలకు నేడవమాసము మొదలు భూపతనమువరకు జ్ఞానము మెండై భూపతన మైనతోడనే యజ్ఞానమనెడి మాయ యావరించి యీ కమలము ముకుళించుకొని పోవును.

మూలాధారంబునకు నెనిమిదంగుళములమీద సుషుమ్నానాళము ననుసరించి నాడి చక్రమున్నది. ఆ నాడిచక్రమునుండి కుహూనాడి, సినీవాలీనాడి, రక్తాహ్వయనాడి యను మూడునాడులు నధోముఖవ్యాపనముగలవై యుండును. ఆ నాడీచక్రమునుండి యనేకనాడులు లూర్ధ్వముఖవ్యాపనముగలవై యుండును. నాడులకు గూడలిస్థానమై వానిలో గొన్నిటి నధోముఖముగను గొన్నిటి నూర్ధ్వముఖముగను వ్యాపింపజేయు మధ్యమస్థానము గనుక నాడీచక్రమని జెప్పబడును. ఱొమ్మెముకకును వీణాదండమున కును మధ్యను అధోముఖముగ వ్రేలాడు మాంసపిండమునే హృదయమని జెప్పుదురు. ఇదియె హృత్పుండరీకము. ఇందు జీవాత్మయుండును. మేదస్సునుండియే సుషుమ్నానాళ ద్వారమున నిక్కడికి నాడులు వచ్చును. మరియు నీ సుషుమ్న మూలాధారమునుండి

తిరిగి వెళ్లునపుడు తనతోడ నుండెడు నిడపింగళయను నిరుచేడియల నిరుప్రక్కల నిడుకొని నూరునాడులతో ననాహతమునకు వచ్చి యా నూరునాడుల నక్కడ విడచి యూర్ధ్వముఖవ్యాపినియై శిరస్సునకు బోవును. మరియు పసిబిడ్డలు గర్భములో నున్నకాలమునందు దల్లి భుజించిన యన్నపానాదులరసమును తమ నాభియందుండెడి తీగగుండ గ్రహించి యందువలన వృద్ధినొందెదరు. భూపతనమైనతోడ్తోడన నా తీగను గోయుదురు. గర్భమందున్నకాలములో వాగింద్రియవ్యాపారము లేదు. నోటితో దినుటయును లేదు. ఈ తీగయే తన్గ్రహణమున కాధారము. ఈ నాభినాళమును నవద్వారములకంటె మించిన యొకద్వారమని జెప్పుదురు.

వీణకు తంతులవలె నీ వీణాదండమునకు గుదస్థానమునుండి కపాలమువరకు నొకటిమీద నొకటిగా మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞేయము, సహస్రారము ననెడు సప్తచక్రంబులు గలవు. అందు మొదటియారును షట్కమలములని యెన్నబడును. సుషుమ్నానాడి నీ యారు కమలములగుండా సంచరించును. గనుక నీ యారుకమలములకును సుషుమ్నానాళమందలి నాడులతో సంబంధముగలదు.

## షట్కమలములు.

శ్లో॥ మూలాధారంగుదస్థానం స్వాధిష్ఠానంతుమేహనం।
నాభిస్తుమణిపూరాఖ్యం హృదాయాబ్జమనాహతం।
తాలుమూలంవిశుద్ధాఖ్య మాజ్ఞాఖ్యంనిటలాంబుజం।
సహస్రారంబ్రహ్మరంధ్ర మిత్యాగమవిదోవిదుః॥

1. మూలాధారము:—గుదస్థానమందు నాల్గుదళములుగల కమలముండును. వ, శ, ష, స అనెడు నాలుగును బీజములు. ఈ కమలమున కధిపతియగు గణపతికి అజపా గాయత్రీమంత్రజపమున ఆరువందలుహంసలు సమర్పింపబడును. ఇది పృథివికి స్థానము గాన దీనికిని ముక్కునకును సంబంధము. ఇది మలవిసర్జనమునకు గారణము. (అపరంజీవన్నె) విషయంబులు—సుగంధ, దుర్గంధ, సుగంధీమిశ్రదుర్గంధ, దుర్గంధమిశ్రసుగంధంబులు నాలుగుదళంబులు.

2. స్వాధిష్ఠానము:—మూత్రద్వారమందు ఆరుదళములుగల కమలముండును. బ, భ, మ, య, ర, ల యనెడు నారును బీజములు. ఈ కమలమున కధిపతియగు

సరస్వతితో గూడియుండు బ్రహ్మకు అజపా గాయత్రీమంత్రజపమున ఆరువేలహంసలు సమర్పింపబడును. ఇది జలమునకు స్థానము గాన దీనికిని నాలుకకును సంబంధము. ఇది మూత్రవిసర్జనకు శుక్లశోణితములవిసర్జనమునకును గారణము. (తెల్లనిరంగు) విషయంబులు—వగరు, తీపు, ఉప్పు, కారము, చేదు, పులుసు అని ఆరుదళంబులు.

3. మణిపూరకము :—నాభియందు పదిదళములుగల కమలముండును. డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ అనెడు పదియును బీజములు. ఈ కమలమున కధిపతి యగు లక్ష్మితో గూడియుండు విష్ణునకు నజపా గాయత్రీమంత్రజపమున ఆరువేల హంసలు సమర్పించబడును. ఇది అగ్నికి స్థానము గాన దీనికిని గన్నులకును సంబంధము. ఇందలి యగ్ని భుజించిన సమస్తపదార్థములను జీర్ణము జేయును. ఇదియె చిత్తమునకు స్థానము. (ఎఱ్ఱనిరంగు) విషయంబులు—తెలుపు, నలుపు, పసపు, ఆకుపచ్చ, ఎఱుపు, మిశ్రము, లావు, సన్నము, పొట్టి, పొడుగు పదిదళంబులు.

4. అనాహతము :—వక్షస్థలమందు ఱొమ్ముకకును వీణాదండమునకును మధ్య నుండెడి హృత్పద్మము. ఇది పండ్రెండుదళములుగల కమలము. క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ అనెడు పండ్రెండును బీజములు. ఈ కమలమున కధిపతి యగు పార్వతితో గూడియుండు రుద్రునకు అజపా గాయత్రీమంత్రజపమున ఆరు వేలహంసలు సమర్పింపబడును. ఇది వాయువునకు స్థానము గాన దీనికిని త్వగింద్రియమునకును సంబంధము. ఇదియె ప్రాణవాయుసంచారమునకును అహంకారమునకును స్థానము. (ఆకుపచ్చవన్నె) విషయములు—శీత, ఉష్ణ, శీతమిశ్రోష్ణ, ఉష్ణమిశ్రశీత, మృదు, కఠినస్పర్శంబులారును అల్ప అధికంబులచేత పండ్రెండుదళంబులు.

కంఠమునకు క్రిందుగను బొడ్డునకు జానెడు మీదుగనుండి యధోముఖముగ వ్రేలాడు మాంసపిండమగు హృత్పద్మమందు పరమాత్మ యున్నాడు.

కొట్టబడకయే మ్రోగుచుండెడు ననాహతమందు శబ్దము పుట్టును. ధ్వని యుండుటవలన శబ్దము కలుగును. ధ్వనియందు వెలుగును. ఆ వెలుగునందు మనస్సున్నవి. మనోలీనమైన చో ముక్తి కలుగును. దీనినే యమనస్కమనియు జెప్పుదురు.

మనసును స్వాధీనముచేసుకొనుటకు ముఖ్యందుగా ననాహతమందు దృష్టిని నిలిపినచో శబ్దమంతయు నణగి ప్రణవనాదమను ధ్వని వినబడును. అటుల నభ్యాసము చేయనుజేయను ప్రణవనాదము తగ్గి స్వప్రకాశము గనబడును. దానినే ఆత్మజ్యోతియని జెప్పుదురు.

పిమ్మట హిరణ్మయకోశమగు మనస్సుయొక్క నిజమగు స్వరూపము దెలియును. అప్పటికిని సాత్వికాహంకారముండును. మనస్సు పరబ్రహ్మమును జూడలేకపోయినను పరబ్రహ్మమం దైక్యమగును. ఈ చక్రమందు గొట్టబడకయే దశవిధప్రణవనాదములు మ్రోగుచుండును. గనుక అనాహతచక్రమని జెప్పబడుచున్నది. ఈ నాదానుభవము యోగాభ్యాసముగలవారికే తెలియును. నాదమనగా మూలాధారమునుండి హృదయమున బుట్టిన సంగీతధ్వని. కుండలీయోగముచేత నాదబ్రహ్మమును లేపి యానందమును జెందవలయును.

5. <u>విశుద్ధము</u> :—కంఠస్థానమందు బదియారుదళములుగల కమలముండును. అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, అం, అః అనెడి పదునారును బీజములు. ఈ కమలమున కధిపతియగు నీశ్వరునకు నజపా గాయత్రీమంత్రజపమున వెయ్యిహంసలు సమర్పింపబడును. ఇది యాకాశహంసము గాన జవులతో సంబంధము గలిగియుండును. ఇదియె మనస్సునకు స్థానము. సమస్తభూతములయందుండెడి యాత్మ సహస్రారమందుండి విశుద్ధచక్రంబునందలి పదియారుదళంబులను వీక్షించుచుండును. (నీలవర్ణం) విషయంబులు—అకారాదిషోడశస్వరూపశబ్దంబులే షోడశదళంబులు.

6. <u>ఆజ్ఞాచక్రము</u> :—భ్రూమధ్యమందు రెండుదళములుగల కమలముండును. హం, క్షం యనునవి బీజములు. ఈ కమలమున కధిపతియగు సదాశివునకు నజపా గాయత్రీమంత్రజపమున వెయ్యిహంసలు సమర్పింపబడును. ఇది బుద్ధికి స్థానము. మనస్సునకు కంఠము స్థానమైనను సకలేంద్రియవ్యాపారములు చేయుటయందు ఆజ్ఞాచక్రమునకు వచ్చును గనుక మనస్సునకు విషయములుగల సంకల్పవికల్పములే యీ చక్రమునకు రెండుదళములని చెప్పబడెను. (మాణిక్యవర్ణము) విషయంబులు—సంకల్పవికల్పములు రెండుదళంబులు.

మొదటి యైదుచక్రంబులయందు హఠయోగులు క్రమముగ మనస్సు నిలిపి వాయునిరోధము జేసి అభ్యసించెదరు. రాజయోగులు ఆజ్ఞాసహస్రారచక్రములయందే అభ్యాసము జేసెదరు. ఇదియే ముక్తికాంతకు స్థానము. ఇచ్చట ముక్తికాంత లేక జ్ఞానకాంతతో సంయోగమే జీవన్ముక్తి. ఇదియే జీవేశ్వరైక్యము. దీనినే త్రినేత్రమనియు జెప్పుదురు.

కుండలీశక్తిరూపమైన బిందుతత్త్వము జగద్వ్యాపారవృత్తి గలిగినప్పుడు నిలువ నాధారమైనందున మూలాధారమనియు, ప్రభావము చూప తనచేత నధిష్ఠింపబడుట వలన స్వాధిష్ఠానమనియు, సాధకుడు తన్ను నారాధించుసమయమున మణిమయంబులై మ్రోగుచుండు అందెలు, కడియములు, కిరీటము, భుజకీర్తులు మొదలగు నగలచేత తనశరీరము నిండించెడి స్థానమగుటవలన మణిపూరకమనియు, సాధకుడు పూజాకాలమందు విఘ్నకారులగు దుష్టభూతభేతాళరాక్షసాదులపోకకు మంగళవాద్యములు చేయుట ప్రసిద్ధము గనుక సాధకునకు సాహాయ్యముగ కొట్టకనే చిణి, చిణిచిణి, ఘంట, శంఖ, వీణ, తాళ, వేణు, భేరీ, మృదంగ మేఘధ్వనులు కలుగుచుండుటవలన అనాహతమనియు, సాధకుడు శుద్ధస్ఫటికాకృతిగా తన్ను ధ్యానించుచోటగుటచేత విశుద్ధమనియు, తనయాజ్ఞ చెల్లించు స్థలమగుటవలన యాజ్ఞాచక్రమనియు, షట్చక్రములకు పేళ్లు గలిగెను.

సహస్రారము :— ఈ కమల మాజ్ఞాచక్రమునకు మీదుగ కపాలకుహరమందుండును. ఈ కమలమున కెనిమిదిదళములు గలవు. ఒక్కొక్కదళమునందు నూట యిరువదియైదు రేకులు. అట్లు కమలమునకు వెయ్యిరేకులు కలిగియుండును. ఈ చక్రాధిపతియగు పరమాత్మకు అజపా గాయత్రీమంత్రజపమున వెయ్యిహంసలు సమర్పింపబడును. ఎనిమిదిదళములు గలిగియుండుటచేత నష్టదళపద్మమనియు, వేయి రేకులు గలిగియుండుటచేత సహస్రారమనియు జెప్పబడును.

దౌడలమధ్యను స్తనమువలెనే వ్రేలాడు మాంసఖండముండును. అది కపాలకుహరమును జీల్చుకొని వెలుపలికి వచ్చి వేరుగా గనపడుచున్నది. ఇదియు బ్రహ్మస్వరూపప్రాప్తికి మార్గము. దీనినే కొండనాలుకయని జెప్పుదురు.

## పంచాక్షరీస్థానములు.

నకారము...పృథివీతత్త్వము - ఆధారచక్రము.
మకారము...ఆపోతత్త్వము - స్వాధిష్ఠానచక్రము.
శికారము...అగ్నితత్త్వము - మణిపూరచక్రము.
వాకారము...వాయుతత్త్వము - అనాహతచక్రము.
యకారము...ఆకాశతత్త్వము - విశుద్ధచక్రము.
ఓంకారము - ఆజ్ఞాచక్రము.
ఈ యన్నిటి సంపుటీకరణము సహస్రారము.

## పరమాత్మస్థానములు.

పరమాత్మ—స్థూలశరీరమందు...బొమ్మముకకును వీణాదండమునకును మధ్యను వ్రేలాడు మాంసఖండమందుండును.

సూక్ష్మశరీరమందు... నేత్ర స్థానమందుండును.

కారణశరీరమందు...దౌడలమధ్యను వ్రేలాడు మాంసఖండమందుండును.

మహాకారణశరీరమందు...కపాలకుహరమండలి సహస్రారచక్రమందుండును.

శరీరరహితమందు...సర్వవ్యాపకమై యంతర్బాహ్యములయందు సర్వత్రా నిండి నిబిడీకృతమై యుండును.

తాలువులమధ్యను వ్రేలాడుచుండెడి మృదువగు మాంసఖండమునుండియే యోగానుభవముగలవారలకు సుధ (అమృతము) స్రవించుచుండును. ఆసుధాపానమండలి నిరంతరసుఖము వారికే తెలియవలెను గాన ఇది పరమాత్మస్థానముగా నెంచబడినది.

ఆజ్ఞాచక్రమునకుమీద పండ్రెండంగుళములదూరమున సహస్రారచక్ర ముండుటచేత నిది ద్వాదశాంతమని చెప్పబడును. ఆజ్ఞాచక్రమునకుపైని నొక యంగుళమువరకు శక్తియని, దానిపైని మూడంగుళములవరకు వ్యాపినియని, అవల నాలుగంగుళములదాక సమనయనియు, ఆ మీద నాలుగంగుళములవరకు సున్మనియనియు సుషుమ్నకు పేరులు.

ఈ యష్టదళపద్మమందు హంస.

1. తూర్పుదళముమీద వాలిన—పుణ్యమతియై పుణ్యకర్మములను జేయ దలంపును;
2. ఆగ్నేయదళముమీద వాలిన—నిద్రాలస్యములు సోమరితనమును ;
3. దక్షిణపుదళముమీద వాలిన—క్రూరపుపనులు చేయ తలంపును ;
4. నైఋతిదళముమీద వాలిన—పాపకర్మములను జేయ దలంచును ;
5. పశ్చిమదళముమీద వాలిన—ఆటపాటలయందు దలంపును ;
6. వాయువ్యదళముమీద వాలిన—గమనాగమనంబులు చేయ తలంచును ;
7. ఉత్తరపుదళముమీద వాలిన—సంభోగములయం దిత్సయును వివిధపదార్థముల ననుభవించవలెనని తలంచును ;
8. ఈశాన్యదళముమీద వాలిన—అన్నదానము, ద్రవ్యదానము, భూదానము మొదలుగాగల దానములు చేయవలయునని దలంచును ;

కమలమధ్యమందుండిన—వైరాగ్యము, పరమోపశాంతి, శమదమోపరతి, తితీక్షా శ్రద్ధాసమాధానములు మొదలగు సత్వగుణములును;

కమలముయొక్క యగ్రమున—అనగా కేసరములయందుండిన జాగ్రదవస్థ యును;

ఆ కేసరములమధ్య దుద్దుపైనుండిన—స్వప్నావస్థయును;

పద్మనాళమున దిగిన—సుషుప్త్యవస్థయును గలుగును.

ఈ పద్మమును విడుచుటయే తురీయ్యము. అదియే సన్యాసము. అట్లు గాన మనస్సు నూర్ధ్వముఖవ్యాపనము జేసి మెల్లన మూలాధారంబు దాటుటవలన పృథివీ తత్వంబు జయంబగును. పిమ్మట స్వాధిష్ఠానకమలంబున కెక్కి యొకనిముషముండి యంత నదియు నతిక్రమించుటవలన జలతత్వంబు జయంబగును. అనంతరము మణి పూరకమలంబున బ్రవేశించి యందుండెడి సమానవాయువును గూడి యా కమలము దాటుటవలన తేజోతత్వంబు జయంబగును. అంత ననాహతకమలంబు జేరి యందలి ప్రాణవాయువును గలసి యా కమలమును దాటుటవలన వాయుతత్వంబు జయం బగును. విశుద్ధకమలంబుం జేరి యందలి యుదానవాయువును గలసి యా కమలమును దాటుటవలన నాకాశతత్వమ్ము జయంబగును. ఆ పిమ్మట నాజ్ఞాచక్రంబు జేరి యందు స్థిరముగా నిలచి మట్టు మధ్యాహ్నమందలి సూర్యునివలెనే నివాతస్థానంబు (గాలిలేని చోట) నందుండెడి దీపంబుల బోలియుండి యదియు నతిక్రమించుటవలన మనస్తత్వంబు జయంబగును. అందుండి మెల్లన జంద్రమండలంబు దాటుటవలన సహస్రారకమల వాసుండును గురుస్వరూపుండు నగును. నాదబిందుకళల నతిక్రమించి సహస్రార కమలమందు జేరి సుఖాసీనుండై యణిమాద్యష్టసిద్ధులును, దూరశ్రవణ ఆకాశగమన ములసిద్ధియును గలిగి నిగ్రహానుగ్రహసామర్థ్యము గలిగి త్రికాలజ్ఞానియై సమస్తలోక ములయందలి సమస్తవ్యాపారములను గరతలామలకముగా గనుగొనుచు సర్వజ్ఞుండై యుండును. ఇది సమస్తయోగములకు రాజయోగమని జెప్పబడును. అట్టి రాజయోగ మభ్యసించి కృతార్థులు గావలయును.

సుషుమ్ననాడి మధ్యమందు మెరుపుదీగె యున్నది. ఈ మెరుపుదీగెయందలి కాంతికే కళయనియు, నాకళలో నిష్కళయే పరబ్రహ్మస్వరూపమనియుం జెప్పుదురు,

## హంసవిషయము.

మూలాధారంబునకంటె రెండంగుళములమీదను, స్వాధిష్ఠానంబునకు రెండంగుళములదిగువను కుక్కుటాండంబువలె నాడీచక్రముండును. దానియందు డెబ్బదిరెండు వేలనాడులు పుట్టి శరీరంబున వ్యాపించుకొనియుండును. వానిలో పదినాడులు ముఖ్యంబులు. వీనిలో మూడునాడు లతిముఖ్యంబులు. (అనగా ఈడపింగళసుషుమ్న నాడులు.)

హంస యనగా ఉఛ్వాసనిశ్వాసంబులు. దీనికే ప్రాణమనియు జెప్పుదురు. హకారబిందుసకారములే హంస. హకారము శివబీజము. సకారము శక్తిబీజము. ఈ రెంటిమధ్యను శివశక్తులకు ఐక్యస్థానమై బిందురూపమగు బుద్ధితత్వము ప్రకాశించుచుండును. హకారమే శుక్లము. సకారమే రక్తము. ఈ రెంటియొక్క సంయోగమే బిందువు. హకారమే సూర్యనాడి లేక పింగళయని చెప్పబడి కుడిముక్కున వాయువును బీల్చును. సకారమే చంద్రనాడి లేక ఈడయని చెప్పబడి ఎడమముక్కున వాయువును బీల్చును. మధ్యనుండెడి బిందువునకే తేజోనాడియని లేక సుషుమ్నయని జెప్పబడును. సకారము శక్తిబీజము గనుక బుద్ధి హకారమువైపున దిరిగినప్పుడు ప్రపంచవిషయజ్ఞానమును హకారమువైపున దిరిగినప్పుడు నిర్విషయజ్ఞానమున్ను కలుగును. ఈ మూడే నాదబిందుకళలు.

ఈ హంస ప్రాణవాయురూపమున ప్రత్యక్షముగ కనబడును.

ప్రాణము—అనగా లోపలికిపోయి వెలుపలికి వచ్చుశ్వాసము.

1 ప్రాణము—4 సెకండ్లకాలము.

6 ప్రాణములు—1 ఘలము లేక 1 విఘడియ.

15 ప్రాణములు—1 నిమిషము లేక 1 మినుటు.

60 నిమిషములు—1 గంట.

24 గంటలు—1 దినము.

గనుక దినమునకు ప్రాణములు 21,600.

ఈ హంస మూలాధారస్వాధిష్ఠానమణిపూరకనవాహతవిశుద్ధ్యాజ్ఞేయంబులను షడాధారంబుల జుట్టి తిరుగుచుండును. ఆరోహణము అవరోహణములే సోహము. కనుక నాదబ్రహ్మమును లేపి యానందించవలయును, రేచకపూరకములే ఆరోహణా అవరోహణంబులని తెలియునది,

త్రివేణిసంగమము, త్రికూటము, శృంగాటము, చతుష్పదము. ఇదే ఆజ్ఞ చక్రము, భ్రూమధ్యం. దీనికి 12 అంగుళములమీద బ్రహ్మరంధ్రము. ఇదే ద్వాదశాంతము. దీనియందు వేయిదళములుగల సహస్రారచక్రము గలదు. అది 125 చిన్న రేకులుగల 8 పెద్ద రేకులు గలిగియుండును. ఇదే అష్టదళపద్మము. దీనిమధ్యమందు శివబీజమైన హకారమును, శక్తిబీజమైన సకారమును ఈ రెంటినడుమ త్రాసుముంటి వలె శివశక్తులకు ఐక్యస్థానము. దీని తెలిసి లక్ష్యముంచినవారే పరమహంసలు, అవధూతలు, జీవన్ముక్తులు.

అకారబిందుసకారములే నాదబిందుకళలు, సోమసూర్యాగ్నిమండలములు.

హకారబిందుసకారములు తమ్ము నమ్మినవారి సంసారబంధంబు హరించునవి గావున హంస యనబడును.

## అక్షివిషయము.

అక్షి యనగా నేత్రము. ఇంద్రియములలో ప్రధానమగు నేత్రమునుగురించి చెప్పబడును.

నేత్రమునకు మధ్యను గోప్యముగ అంగుష్ఠమాత్రపురుషుడగు పరమాత్మ యున్నాడు.

నేత్రస్థానమందుండెడి నల్లగుడ్డునకే నల్లగలువయని జెప్పుదురు. అందు మధ్యను నివ్వరిధాన్యపుముల్లువలెనే అతిసూక్ష్మమగు రంధ్రమున్నది. అందు విద్యుల్లేఖ యనెడు మెఱుపుతీగె ప్రకాశించుచుండును. అది యేకళ. నిష్కళయే పరమాత్మ స్వరూపము. ఈ నేత్రస్థానమే పరమాత్మస్థానమని పెద్దలు జెప్పుదురు. ఈ కళయే ముక్తికాంతయనియు, జ్యోతియనియు, స్వప్రకాశమనియు జెప్పుదురు. ఈ ప్రకాశమువల్లనే సూర్యునికి ప్రకాశము గలిగినది. సూర్యునివలన చంద్రునికి ప్రకాశము గలిగినది. కావున వెలుగునకు కారణము కళయేయని తెలియునది. ఇదియ హిరణ్మయకోశము.

సూర్యునియొక్క కాంతి తెలుపు అని సర్వత్ర తెలిసినవిషయమే. అదియే శుద్ధసత్వప్రధానము. సూర్యకాంతి ప్రత్యక్షముగ తెలుపురంగు గలదైనను నిజముగ చూడగా వివిధరంగులయొక్క చేరికయని తెలియగలదు.

సూర్యకాంతి ముక్కోణపు అద్దముచేత భాగించబడి వివిధరంగులైనట్లు నేత్ర స్థానమందును రెండురంగులు గలవు.

1. ఎరుపు.

2. నారింజపండువర్ణము (ఎరుపు పసుపు కలసిన వర్ణము.)

3. పసపుపచ్చవర్ణము.

4. ఆకుపచ్చవర్ణము.

5. నీలవర్ణము. దీనికే నల్లగుడ్డు అని జెప్పుదురు.

6. సునీలవర్ణము. ఇదియే పాప.

7. ఇంద్రనీలవర్ణము.

అద్దమును దెచ్చి అందులో ప్రతిబింబమును జూచినచో అన్నిరంగులు తెలియ గలవు. ఈ యేడురంగులు సప్తచక్రంబులనియు, అందలికళయే సుషుమ్నయనియు, నిష్కళయే పరబ్రహ్మస్వరూపమనియు పెద్దలు జెప్పుదురు. 2, 3, 4 రంగులు కలిపి తెలుపుగా నెన్నబడును.

ఎఱుపు :—తెల్లగుడ్డుచుట్టూ ఉండేది. పృథివీతత్వము, క్రియాశక్తి, బ్రహ్మ అధిదేవత, అకారంమాతృక, అన్నమయకోశము, సద్యోజాతముఖము.

తెలుపు :—తెల్లగుడ్డు. ఆపోతత్వము, జ్ఞానశక్తి, విష్ణుయధిదేవత, ఉకారం మాతృక, ప్రాణమయకోశము, వామదేవముఖము.

నలుపు :—తెల్లగుడ్డు మధ్యనుండు నల్లగుడ్డు. తేజోతత్వము, ఇచ్ఛాశక్తి, రుద్రుడధిదేవత, మకారంమాతృక, మనోమయకోశము, తత్పురుషముఖము.

సునీలము :—నల్లగుడ్డు మధ్యనుండు నీలమైన పాప. వాయుతత్వము, ఆదిశక్తి, ఈశ్వరుడధిదేవత, అర్ధమాత్రుక, విజ్ఞానమయకోశము, అఘోరముఖము.

ఇంద్రనీలము :—పాపమధ్యను వెలిగేకళ. ఆకాశతత్వము, పరాశక్తి, సదాశివుడధిదేవత, ఓంకారంమాతృక, ఆనందమయకోశము, ఈశానముఖము.

—ఈ యైదురంగు లైదుచక్రములనియు, బిందువే ఆజ్ఞాచక్రమనియు, కళయే సహస్రారమనియు, నిష్కళయే పరబ్రహ్మస్వరూపమనియు తెలియునది.

నల్లగుడ్డునకే :—అండాండమనియు, గంగయనియు, చంద్రమండలమనియు, నాదమనియు, ఈడయనియు, కామాక్షియనియు, స్థూలదేహమనియు, జాగ్రదవస్థయనియు, తమోగుణమనియు.

పాపకే:—పిండాండమనియు, యమునయనియు, నీలతోయదమనియు, సూర్యమండలమనియు, బిందువనియు, పింగళయనియు, మీనాక్షియనియు, సూక్ష్మశరీరమనియు, స్వప్నావస్థయనియు, రాజసగుణమనియు.

పాపమధ్యను వెలిగేకళకే :—బ్రహ్మాండమనియు, సరస్వతియనియు, విద్యుల్లేఖయనియు, అగ్నిమండలమనియు, కళయనియు, సుషుమ్నయనియు, విశాలాక్షియనియు, కారణదేహమనియు, మహాకారణమనియు, సుషుప్త్యవస్థయనియు, తుర్యావస్థయనియు, సాత్వికగుణమనియు జెప్పుదురు.

ఈ కళలలో నిష్కలయే పరబ్రహ్మస్వరూపము.

పృథివ్యాపస్తేజోవాయురాకాశము లనెడు పంచభూతములు. క్రియాశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, ఆదిశక్తి, పరాశక్తి యనెడి పంచశక్తులును; బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివు లనియెడి పంచదైవతములును; అకార, ఉకార, మకార, అర్ధమాత్రక, ఓంకారము లనియెడు పంచమాత్రకలును; అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయము లనెడు పంచకోశంబులును; అండాండ, పిండాండ, బ్రహ్మాండము లనియెడు అండత్రయమును; గంగా, యమునా, సరస్వతు లనియెడు వేణీత్రయమును; సూర్య, చంద్రాగ్నిమండలంబు లనియెడు మండలత్రయంబును నాదబిందుకళలును; ఈడ, పింగళ, సుషుమ్నలును; కామాక్షి, మీనాక్షి, విశాలాక్షి యనియెడు అక్షిత్రయమును సత్వరజస్తమోగుణంబులును; మూలాధారస్వాధిష్ఠానమణిపూరకఅనాహతవిశుద్ధయాజ్ఞానసహస్రారంబు లనియెడు సప్తచక్రంబులును; స్థూలసూక్ష్మకారణశరీరంబు లనియెడు శరీరత్రయంబును; జాగ్రత్స్వప్నసుషుప్తు లనియెడు అవస్థాత్రయంబును; నేత్రాస్థానమందే నిరూపించబడియెను. సమస్తవృత్తులును నేత్రస్థానమందే పుట్టును. నిద్రయును సంగమమందలి కోరికయును అచ్చటనే కలుగును. రేతోస్ఖలనము ఆస్థానమునందే కలుగును. కావుననే రేతోస్ఖలన మప్పుడు నీరసమును, నిస్త్రాణియును, నేత్రములయందు బరువును కలుగును. ఇది స్వానుభవమువల్లనే తెలియగలదు.

అతిసూక్ష్మములగు అణువులకంటె అణువును, అతిస్థూలమైన మహత్తుకంటె మహత్తును యగు పరమాత్మ జంతువులయొక్క బుద్ధి గుహాయందుండును.

నేత్రమందలి పాపకు మధ్యస్థ నివ్వరిముల్లువంటి అతిసూక్ష్మమగు రంధ్రమున్నది. ఇక్కడనుంచియే నాడులు కపాలమునకు బోవును. ఆరంధ్రమధ్యమందు ముక్తికాంత యున్నది. ఈ నాళమే నడినాళమనియు, బ్రహ్మరంధ్రమనియు, మేరు శిఖరమనియు, సుషుమ్నానాళమనియు చెప్పుదురు. అందుండెడి ముక్తికాంతకే కళ యనియును, ఆపోజ్యోతియనియును జెప్పుదురు.

మనస్సును క్రమక్రమముగా లీనముజేసి మాచెడివాడున్ను, *మాడబడునది యును లేక నిరామయుడై తుర్యావస్థను పొంది ముక్తి నొందవలయును. మనస్సును వృత్తిరహితము జేసి యనుభవజ్ఞులు గావలయును.

<u>అక్షరుడు</u> :—రక్త, శ్వేత, కృష్ణ, నీలవర్ణములమధ్యను ప్రకాశించు అపోజ్యోతినే నీలతోయదమధ్యస్థమైన విద్యుల్లేఖయనియు, అక్షరుండనియు చెప్పుదురు. ఇదియె అంతర్లక్ష్యం, గగనముద్ర, శిఖాస్థానము, అగ్నిశిఖ, సర్వసాక్షి, చిన్మయనేత్రస్థానము, మేరుశిఖరము, కైలాసము, సత్యలోకవైకుంఠములకు స్థానము అని జెప్పుదురు.

## పిండోత్పత్తి.

గర్భమందు పిండముయొక్క యుత్పత్తినిగురించినది గనుక పిండోత్పత్తి యని జెప్పబడియె.

| | |
|---|---|
| ఆరగించిన అన్నము | ...7 దినములకు రసమగును. |
| రసము | ...7 దినములకు రుధిరమగును. |
| రుధిరము | ...7 దినములకు మాంసమగును. |
| మాంసము | ...7 దినములకు మేదస్సగును. |
| మేదస్సు | ...7 దినములకు అస్థియగును. |
| అస్థి | ...7 దినములకు మజ్జయగును. |
| మజ్జ | ...7 దినములకు శుక్లశోణితములగును. |

సతిపతులు రతులుసల్పగ శుక్లశోణితములు మేళనమై 5 దినములకు నీరుబుగ్గ యగును. 10 దినముములకు నెత్తురై 15 దినములకు మాంసపుముద్ద యగును. 20 దినములకు గట్టిపడి 25 దినములకు మనుష్యాకారం బేర్పడును. మొదటినెలయందు పంచభూతములు గూడి తల యేర్పడును. రెండవనెలను మేదస్సు, చేతులు, కాళులు ఏర్పడి మూడవనెలను యెముకలు, మజ్జగోళ్లు, వెండ్రుకలు, చర్మము కల్గుగును. నాల్గవనెలను సప్తధాతువులును. ఐదవనెలయందు చెవులు, ముక్కు, కన్నులు, నోరు జనించి ఆకలిదప్పులు పుట్టును. ఆరవనెలయందు కడుపు కంఠనాళము యేర్పడి అరణియం దగ్ని ప్రవేశించునట్లు జీవుడు గర్భరూపముగ బ్రవేశించుచున్నాడు. ఈ మాసమందే మావిచేత గప్పబడి తల్లి భుజించిన యన్నపానాదులవలన తృప్తి నొందుచుండును. ఏడవనెలయందు జనించిన రోగియగును. ఈ మాసమందే జ్ఞానము కలుగును. ఎనిమిదవనెలయందు కలిగిన బిడ్డ బ్రతుకదు. తల్లిగాని బిడ్డగాని మృతినొందును. తొమ్మిదవనెలయందు గర్భమందలి శిశువునకు విజ్ఞానము కలుగును. మావియనెడు సంచి యందలి నీటియందు తొణికిసలాడుచుండును. శుక్లశోణితవికారముగా మాతృగర్భములో చిక్కుపడి జఠరాగ్నిచేతను, క్రిమికీటకాదులచేతను, మాతృభుక్తకటుకషాయాదిపదార్థములచేతను, శ్రమ నొందుచుండినను బయలున తిరుగ నభ్యాసము లేనియెలుక తానున్న కలుగే ప్రపంచమనియు, సౌఖ్యమైనదియనియు నెంచినట్లు మాతృగర్భకోశమే సుఖమైనదిగా దలంచి అచ్చటనే యుండ నిశ్చయించి ప్రపంచములోనికి పోజాలనని పరితపించుచుండును. పదిమాసములు నిండగను నాభినాళము క్రమముగ బలియుటచేత మాతయొక్క సమానవాయువు నిలువ తావులేక వ్యానవాయువుచేత ద్రోయబడి తల్లి అన్నకోశములోనుండి పండినపండునకు తొడిమదాని కదిసల్లినచందంబున జారుచుండగ నొప్పులు కనిపించును. అప్పుడు వాయువ కుంభింపబడును. అట్టి కుంభకముచేత పొరయందున్న శిశువు అధోముఖమై తెలివి నశించి కుంభకముచేతనే పొర పగిలి శిశువు భూమిమీద బడి జన్మించును.

స్త్రీలకు ఋతుదినము మొదలు 16 దినములవరకు కళ హెచ్చి గర్భము నిలుచును.

1-వ స్త్రీ బహిష్టియైనదినంబున కూడిన శుక్లశోణితంబులు—అల్పాయువు గలవాడై జన్మించును.

2-వ దివసంబున—పిండంబు మధ్యదినంబులలో సేయూడి భూమిమీదబడును.

3-వ దివసంబున—అతిచోరుఁడై జన్మించును.

4-వ దివసంబున—మగవాఁడు, అల్పాయువు, దరిద్రుఁడు.

5-వ దివసంబున—కూఁతురు, మంచిపుత్త్రులుగలది.

6-వ దివసంబున—కుమారుఁడు, మధ్యమగుణము.

7-వ దివసంబున—పుత్త్రవతియగు కుమార్తె.

8-వ దివసంబున—మహదైశ్వర్యసంపన్నుఁడగు కుమారుఁడు.

9-వ దివసంబున—పతివ్రతయగు కుమార్తె.

10-వ దివసంబున—మంచికుమారుఁడు.

11-వ దివసంబున—అధర్మరాలైన కూఁతురు.

12-వ దివసంబున—పురుషోత్తముఁడగు కుమారుఁడు.

13-వ దివసంబున—వర్ణసంకరురాలును, దుర్మార్గురాలు నగు కూఁతురు.

14-వ దివసంబున—ధర్మము చేయువాఁడును, కృతజ్ఞుఁడును, దృఢవ్రతుండును, ఆత్మజ్ఞానముకలవాఁడు నగు పుత్త్రుఁడు. భూమికి రాజుగా నగును.

15-వ దివసంబున—రాజుకు పట్టపుదేవి యగునదియు, అధికసౌభాగ్యము గలదియు, లేక రాజవంశమును పొందునదియు, బహుపుత్త్రులు కలదియు, ప్రతివ్రతయు నగు కూఁతురు.

16-వ దివసంబున—మహా విద్యాప్రవీణుండును, సర్వలక్షణసంపూర్ణుండును, సత్యవాక్యుండును, జితేంద్రియుండును, బ్రహ్మవిద్యాధురంధరుఁడును, సకలజనమిత్త్రుఁడు నగు పుత్త్రుఁడు గలుగును.

ఋతుకాలమందలి సరిదినములయందు గర్భము నిలిచిన మగబిడ్డలును, బేసిదినములయందు గర్భము నిలిచిన యాఁడుబిడ్డలును గలుగుదురు.

తండ్రియంశములు—ఎముకలు, మెదడు, వీర్యము.

తల్లియంశములు—నెత్తురు, వెండ్రుకలు, మాంసము.

సంభోగకాలమందు పురుషునికి—రాజసగుణ మెచ్చిన—రాజసుండును,

తామసగుణ మెచ్చిన—తామసుండును.

సత్వగుణ మెచ్చిన—సాత్వికుండును.

స్త్రీకి—రాజసగుణ మెచ్చిన—వ్యర్థుండును.

తామసగుణ మెచ్చిన—క్రూరుడును.

సత్వగుణ మెచ్చిన—తపస్సంపన్నుడును.

ఉదయకాలమున జనించిన—సాత్వికుండును.

మధ్యాహ్నకాలమున జనించిన—దుష్టవర్తనముగల ధూర్తుడును.

అస్తమయకాలంబున జనించిన—అసురరూపుండును.

రాత్రి సరిప్రొద్దు కాలంబున జనించిన—సకల సామ్రాజ్యసంపదలు గల వాడును.

వేకువజామున జనించిన—దీర్ఘాయుష్మంతుండును అగు పుత్రులు గలుగుదురు. శుక్ల మధిక మైన పురుషుడును, శోణిత మధిక మైన స్త్రీయును, శుక్లశోణితములు సమ మైన నపుంసకుండును, గర్భమందు శుక్లశోణితములు వాయువుచే భేధింపబడెనేని ఇరువురు లేక ముగ్గురు శిశువులు గలుగుదురు.

అష్టమమాసమందు స్త్రీపురుషులు రతిసల్పగ వీర్యమను శిశువు గుడిచి పాప కష్టుండును, జాడ్యగ్రస్తుడు నగును.

తొమ్మిదవమాసమందు రమించగ పిండము గర్భమునుండి యూడిపడును.

పురుషుడు కుడిప్రక్కను, స్త్రీ యెడమప్రక్క నుండుదురు.

## వివరములు.

<u>సాధనచతుష్టయసంపత్తి</u>:—1 నిత్యానిత్యవస్తువివేకము, 2 ఇహాముత్రార్థఫల భోగవిరాగము, 3 శమాదిషట్క సంపత్తి, 4 ముముక్షుత్వము.

<u>శమాదిషట్కసంపత్తి</u>:—1 శమము, 2 దమము, 3 ఉపరతి, 4 తితీక్ష, 5 శ్రద్ధ, 6 సమాధానము.

<u>తాపత్రయములు</u>:—1 అధ్యాత్మికము, 2 ఆదిభౌతికము, 3 ఆదిదైవికము.

<u>ఈషణత్రయములు</u>:—1 పుత్రేషణము, 2 దారేషణము, 3 ధనేషణము.

యజ్ఞోపవీతము :—ఓం = అ + ఉ + మ్. ఇవి మూడును పెద్దపోగులు లేక సూత్రములు. యజ్ఞోపవీతమందలి మూడుపోగులు ఈడ, పింగళ, సుషుమ్న, బ్రహ్మముడియే త్రికూటస్థానము. త్రికూటస్థానమును వదలి సహస్రారమందుండుటయే సన్యాసము.

పెద్దలు :—అపరోక్షసాక్షాత్కారమును స్వానుభవమును గలవారే పెద్దలు.

చతుర్విధశిశ్రూషలు :— 1 స్థానశిశ్రూష, 2 అంగశిశ్రూష, 3 భావశిశ్రూష, 4 ఆత్మశిశ్రూష.

## చతుర్విధగురుశిశ్రూషల, తీర్థప్రసాదముల వివరము.

### సామాన్యపద్ధతి.

1. స్థానశిశ్రూష :—గురుజపతపాద్యనుష్టానములు జేసుకొనునట్టియు, ఆసనశయనాదులు నడుపునట్టియు, ప్రదేశములను మలినములేకుండ నూడ్చియు, నలికియు, బాగుసేయుట స్థానశిశ్రూష.

2. అంగశిశ్రూష :—గురువుయొక్క శరీరమునకు మలినములేకుండ తోముట, కాళ్లుపిసుకుట, మొదలగు నుపచారములు సేయుట అంగశిశ్రూష.

3. భావశిశ్రూష :—గురువు కోరినదానినెల్ల తెచ్చి యిచ్చుచు గురునికి కోరిక లేకుండ జేయుట భావశిశ్రూష.

4. ఆత్మశిశ్రూష :—గురువు కోరినదే ఆయన యభిప్రాయములను దెలిసికొని యిష్టములను నెఱపి కష్టములను దొలగించి తృప్తిపరచుట యాత్మశిశ్రూష.

1. తీర్థము :—గురుపాదోదకము.

2. ప్రసాదము :—గురువు ఉచ్ఛిష్టము.

### అతీతపద్ధతి.

1. స్థానశిశ్రూష :—జాతి వంశ ప్రతిష్ఠలయందలి యభిమానమును, దేహాభిమానమును విడుచుట స్థానశిశ్రూష.

పరబ్రహ్మపదమందు ప్రణవమందలి అ, ఉ, మలకు లక్ష్యార్థమగు దష్టృస్థానమును ఎఱుకమఱపులులేని యునికితో విచారణ జేయుట స్థానశిశ్రూష.

2. అంగశిక్షాప :—కామక్రోధలోభమోహమదమత్సర్యము లనెడు నంత శ్శత్రువులను పంచమలములను లేకుండుట అంగశిక్షాప.

## పంచమలముల వివరము.

1. అణవమలము :—పరబ్రహ్మమును తెలిసికొనవలెనను జ్ఞానమును మఱుగు పఱచునది.

2. కార్మకమలము :—పెద్దలవలన రహస్యములను తెలిసికొనునపుడు గాని యందు బుద్ధిని పోనీయనిది.

3. మాయికమలము :—దట్టమైనయజ్ఞానము.

4. మాయేయమలము :—మాయసంబంధములగు పాపకృత్యములను చేయించు నవి.

5. తిరోధానమలము :—జగత్సత్యం, బ్రహ్మమిధ్య యనెడి యజ్ఞానమును గలుగజేసి జననమరణాదిదుఃఖముల యనుభవమునకు కారణమైనది.

సూర్యచంద్రబ్రహ్మవిష్ణురుద్రాదులే కన్నులు మొదలగు అవయవములని విమ ర్శించి యెరుగుట అంగశిక్షాప.

3. భావశిక్షాప :—మనసు జడమనియు, దాను మనసుకంటె భిన్నుడనియు, శరీరము నశించునది గనుక దాను శరీరముకంటె భిన్నుడనియు, దాను పంచకోశములకు విలక్షణుడనియు ; జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, నంతరింద్రియములు న నెడు చతుర్దశేంద్రియములకును దాను విలక్షణుడై సాక్షిగ నుండుననియు దలంచుట భావ శిక్షాప. పరబ్రహ్మము తానని భావించుట భావశిక్షాప.

4. ఆత్మశిక్షాప :—భావశిక్షాపయందు దాను సాక్షియనియు, విలక్షణు డనియు దెలిసికొనును. ఆత్మశిక్షాపయందు దాను సాక్షి యనుకొనుటయు, వృత్తియే గనుక దాను సాక్షిగాననియు, నఖండపరిపూర్ణసచ్చిదానందస్వరూపమే తాననియు గ్రహించి తాను తానై యుండుట ఆత్మశిక్షాప.

ఆత్మ కాత్మయె ప్రియమైనట్లు కూటస్థాభిన్నపరబ్రహ్మమైన తనయందు తాను తప్పకయుండుట ఆత్మశిక్షాప.

1. తీర్థము :—గురుధ్యానము.

2. ప్రసాదము :—గురుప్రసన్నము.

జ్ఞాపిక. సామాన్యపద్ధతిని పవిత్రతజెందిన భక్తునికి అతీతపద్ధతి పదవి, అతి అనాయాసముగను ప్రాప్తించును.

భక్తిరసములు :—1 శాంతము, 2 దాస్యము, 3 సఖ్యము, 4 వాత్సల్యము, 5 మాధుర్యము.

హస్తమస్తకసంయోగము :—మనస్సును ఊర్ధ్వముఖవ్యాప్తి జేయుమని చెప్పుట.

ఉపదేశము :—మనస్సు నూర్ధ్వముఖముగ నిలుపుటకు స్థాననిరూపన జేసి మార్గమును దెలియజేయుట.

ఉపవాసము :—మనస్సును విషయసుఖములనుంచి దప్పించి సహస్రారమం దుంచుట.

యోగము—రెండువిధములు అనగా,

1. అభ్యాసయోగము :—దీనినే కర్మయోగమనియు, ప్రాణాయామ మనియును జెప్పుదురు. ఈ యోగాభ్యాసమువల్లను చిత్తపరిపక్వము గలుగును.

2. జ్ఞానయోగము :—దీనినే రాజయోగమని జెప్పుదురు. చిత్తపరిపక్వముగలవారీయోగమువలన ముక్తిని బొందుదురు.

ప్రాణాయామము—మూడువిధములు.

1. ప్రాకృతము లేక మంత్రయోగము.
2. వైకృతము లేక లయయోగము.
3. కుంభము లేక హఠయోగము.

మంత్రయోగము—నాల్గువిధములు.

1. అజపరూప మంత్రయోగము.
2. జపరూప మంత్రయోగము.
3. క్రియారూప మంత్రయోగము.
4. స్మరణరూప మంత్రయోగము.

యోగాంగములు—యెనిమిది.

| పూర్వాంగములు. | | | ఉత్తరాంగములు. | |
|---|---|---|---|---|
| యమము ... ... | 1 | | ప్రత్యాహారము ... ... | 5 |
| నియమము ... ... | 2 | | ధారణము ... ... | 6 |
| ఆసనము ... ... | 3 | | ధ్యానము ... ... | 7 |
| ప్రాణాయామము ... | 4 | | సమాధి ... ... | 8 |

జ్ఞానేంద్రియములు 5—శ్రోత్రేంద్రియము (చెవి.)
త్వగింద్రియము (చర్మము.)
చక్షురింద్రియము (కన్ను.)
జిహ్వేంద్రియము (నాలుక.)
ఘ్రాణేంద్రియము (ముక్కు.)

కర్మేంద్రియములు 5—వాగింద్రియము (నోరు.)
పాణీంద్రియము (చేయి.)
పాదేంద్రియము (కాలు.)
పాయ్వింద్రియము (గుదము.)
ఉపస్థేంద్రియము (యోని లేక శిశ్నము.)

అంతరింద్రియములు 4—1. మనస్సు.
2. బుద్ధి.
3. చిత్తము.
4. అహంకారము.

ధారణము :—వాయువుయొక్క రాకపోకలు నిలుపుట.

ధ్యానము :—సగుణధ్యానము, నిర్గుణధ్యానము అని రెండువిధములు.

సమాధి :—సవికల్పము, నిర్వికల్పము అని రెండువిధములు.

భక్తి :—బాహ్యభక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తి అని మూడువిధములు.

జన్మములు :—1 జరాయుజములు, 2 అండజములు, 3 స్వేదజములు, 4 ఉద్భిజ్జము లని నాల్గువిధములు.

ఉత్తరాయణము :—పుష్యమాసము మొదలు జ్యేష్టమువరకు నుండు నారు మాసములు ఇది దేవతలకు పగటికాలము. అందువలన స్వర్గద్వారములు తెరచి యుండును.

దక్షిణాయనము :—మిగిలిన యారుమాసములు ఇది దేవతలకు రాత్రికాలము. అందువలన స్వర్గద్వారములు మూసియుండును.

భూలోక, భువర్లోక, సువర్లోక, మహాలోక, జనర్లోక, తపోలోక, సత్య లోకములు నాభి మొదలుకొని ఊర్ధ్వభాగమందుండును. భూలోకమ్మునకు నాభి స్థానము సత్యలోక మన్నిటికి పైని యుండును గనుక దీనికే ఉత్తరాయణమనియు ; అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళంబు లనెడు అధో లోకములలో పాతాళముచివర నుండును గనుక దీనికి దక్షిణాయమనియు చెప్పుదురు. మృతినొందుట యనగా మనస్సు మగ్నతయగుట. ఉత్తరాయణమందు మనస్సు ఊర్ధ్వముఖవ్యాపనముగలదై నిర్విషయమందు మగ్నతయగును. దక్షిణాయణమందు అధోముఖవ్యాపనముగలదై విషయములయందు మగ్నతయు నగును. గనుక ఉత్త రాయణమందు మృతినొందినవానికి అనగా యెవని మనస్సు ఊర్ధ్వముఖవ్యాపనము గలదై నిర్విషయమందు మగ్నతయగునో అట్టివానికి నిరంతరసుఖము కలుగును. అదియే స్వర్గస్థులగుట.

శరీరము :—మానుషప్రమాణంబు 8 జానల పొడుగు. ముప్పదిమూడుకోట్ల రోమములు. పంచప్రాణములు, పంచకోశములు, పంచజ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, దశవాయువులు, డెబ్బదిరెండు వేలనాడులు, పదిరంధ్రములు, సప్తధాతువులు, అరిషడ్వర్గంబును, నవద్వారములు గలిగి మాయాశరీరం బయ్యె.

అపరోక్షజ్ఞానముగలవారు :—విదేహముక్తులు.

పంచీకరణము :—సంఖ్యనుగురించి జెప్పునది గనుక సాంఖ్యమనియు, పంచ మహాభూతములయొక్క భాగములను పంచిబెట్టుటను తెలియజేయునది గనుక పాంచీ కరణమనియు జెప్పెదరు.

త్రిగుణములు :—అనగా సత్వగుణము, రజోగుణము, తమోగుణము.

పంచమహాభూతములు :—అనగా పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకా శము.

తత్వములు—ఇరువదియైదు అనగా,

| | |
|---|---|
| జ్ఞాత, మనసు, బుద్ధి, చిత్తము, అహంకారము. | అంతరింద్రియములు 5. |
| సమాన, వ్యాన, దాన, ప్రాణము, అపానము. | పంచప్రాణములు 5. |
| శ్రోత్ర, చక్షు, జిహ్వా, ఘ్రాణ, త్వక్కు. | జ్ఞానేంద్రియములు 5. |
| శబ్ద, స్పర్శ, రూప, రస, గంధం బులు. | పంచతన్మాత్రలు. పంచవిషయములు. |
| వాక్పాణి పాదపాయోపస్థంబులు. | కర్మేంద్రియములు 5. |

ఈ యిరువదియైదును గూడి స్థూలశరీరం బయ్యె.

లయము :—పంచమహాభూతములయొక్క సమష్టివ్యష్టిభాగముల యన్యోన్య సమ్మేళనమువలన ఇరువదియైదు తత్వంబులు గలిగెను. ఏ భూతముయొక్క వ్యష్టిభాగ మా యాభూతముయొక్క సమష్టిభాగముతో కలియగను నిరువదియైదు తత్వములు లయమై పంచమహాభూతములు నిలుచును. పృథివి జలమందును, జల మగ్నియందును, అగ్ని వాయువందును, వాయు వాకాశమందును, ఆకాశ మహంకారమందును, అహంకారము మహత్తత్త్వమందును, మహత్తత్త్వము మూలప్రకృతియందును, మూల ప్రకృతి నిర్గుణసాక్షాత్కారపరబ్రహ్మస్వరూపమందును లయమగును.

సూక్ష్మశరీరము :—

| | |
|---|---|
| జ్ఞానేంద్రియములు | 5. |
| కర్మేంద్రియములు | 5. |
| పంచప్రాణములు | 5. |
| మనోబుద్ధులు | 2. |
| చిత్తహంకారము | 2. |
| | 19 |

కారణశరీరము :—జ్ఞాత.

శరీరములు 4—స్థూలము, సూక్ష్మము, కారణము, మహాకారణము.

పంచాగ్నులు :—1. జ్ఞానాగ్ని—ఆత్మయనుపదమందును.

2. కాలాగ్ని—అహంయనుపదమందును.

3. క్షుదాగ్ని—నాభియందును.

4. శీతాగ్ని—హృదయమందును.

5. కోపాగ్ని—నేత్రమందను యుండును.

అవస్థలు 4—జాగ్రత, స్వప్నము, సుషుప్తి, తురీయము, తురీయాతీతము.

పంచకోశములు :—అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశములు.

ప్రణవము :—ఓం = అ + ఉ + మ్.

ఆశ్రమములు 4—బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసము.

పంచమహాపాతకములు :—బ్రహ్మహత్య, కల్లుద్రాగుట, బంగారము దొంగిలించుట, గురుభార్యను పొందుట. ఈ నలుగురిలో నెవరితోనైన గూడియుండుట.

కర్మలు 3—సంచితము, ఆగామి, ప్రారబ్ధము.

ముక్తి—అనగా విడుపుబంధములనుండి విడుపునకే ముక్తియని జెప్పుదురు.

సమాధి—అనగా జీవాత్మపరమాత్మల కైక్యము.

సచ్చిదానందము— అనగా,

సత్ - నశింపక అన్నికాలములయందుండునది.

చిత్ - స్వప్రకాశజ్ఞానస్వరూపముగలది.

ఆనందము - నిరంతరసుఖము నిచ్చునదియగు పరబ్రహ్మస్వరూపము.

మనసు—అనగా సంసారకారణము పరబ్రహ్మమందు లీనమైతేనేగాని ముక్తి లేదు.

ఆకాశము—శబ్దసహితము.

పరబ్రహ్మము—శబ్దరహితము.

అవిద్య—సత్వరజస్తమోగుణత్రయాత్మకము.

బ్రహ్మము—అవిద్యవలన సగుణబ్రహ్మంబై ఐదుభేదములుగ జెప్పబడును. అనగా,

1. శుద్ధచైతన్యము—పరమాత్మ.
2. మాయావచ్ఛిన్నచైతన్యము—ఈశ్వరుడు.
3. అంతఃకరణవచ్ఛిన్నచైతన్యము—జీవుడు.
4. వృత్త్యవచ్ఛిన్నచైతన్యము—మహదహంకారము.
5. విషయావచ్ఛిన్నచైతన్యము—జ్ఞానశూన్యము.

మాయోపాధికబ్రహ్మంబు—సగుణబ్రహ్మము.

మాయరహితబ్రహ్మంబు—నిర్గుణబ్రహ్మము.

సగుణనిర్గుణవిలక్షణబ్రహ్మంబు—నివృత్తియోగికము.

వాసనత్రయము :—శాస్త్రవాసన, లోకవాసన, దేహవాసన.

అష్టసిద్ధులు :—అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, వశత్వము, ఈశత్వము.

మహావాక్యములు—నాలుగు.

1. ప్రజ్ఞానంబ్రహ్మ :—సమస్తభూతములయందు అంతరాత్మగానుండు తెలివియే ప్రజ్ఞానము. ఆ ప్రజ్ఞానము పరబ్రహ్మస్వరూపమే గాని పరబ్రహ్మమునకు అన్యము గాదు. ఇది ఋగ్వేదవాక్యము, జాగ్రదవస్థ స్థూలశరీరము, అన్నమయకోశము.

2. అహంబ్రహ్మాస్మి :—నేను అనియెడు అహంభావము పోయి పరబ్రహ్మమం దైక్యమగుచున్నాను. ఇది యజుర్వేదవాక్యము. స్వప్నావస్థ సూక్ష్మశరీరము, ప్రాణమయమనోమయకోశములు.

3. తత్వమసి :—ఆ పరబ్రహ్మస్వరూపము దేహేంద్రియాదులకు అతీతమై సాక్షిభూతమైన చైతన్యమగు నీవు అయితివి. ఇది సామవేదవాక్యము, సుషుప్త్యవస్థ, కారణశరీరము, విజ్ఞానమయకోశము,

4. <u>అయమాత్మాబ్రహ్మ</u> :—స్వప్రకాశమై నిత్యమై అపరోక్షమై యుండు ఈ యాత్మస్వరూపమే పరబ్రహ్మము. ఇది అథర్వణ వేదవాక్యము, తుర్యావస్థ, మహాకారణశరీరము, ఆనందమయ కోశము.

<u>సర్వంఖల్విదంబ్రహ్మ</u> :—సమస్తము బ్రహ్మస్వరూపము, తుర్యాతీతము, శరీర రహితము, పంచకోశరహితము.

## అమనస్క యోగము.

అమనస్క మనగా మనోలయము. అనగా మనసు లేకుండుట. అనగా సర్వకాలసర్వావస్థలయందు మనసు పరబ్రహ్మమం దైక్యమగుట. అట్లు మనసునకు వృత్తిరహితము కావలయునుగాని పశువులవలె కందమూలాదులు భక్షించినను సర్పములవలె వాయువును భక్షించిననుగాని గేను చుట్టివచ్చు ఎద్దులవలె నిత్యమును దేవాలయములయందు ప్రదక్షిణము జేసినను తాబేలువలె విషయములలో బడనివ్వక ఇంద్రియంబుల నిలిపినను, గబ్బిలములవలె తలక్రిందుగ తపస్సు జేసినను, పంది కొక్కులవలె గుహలలో యుండినను, మఱ్ఱియూడలవలె జడలు దాల్చినను ముక్తిలేదు. అమనస్కంబు గాదు. అమనస్కంబుగా నిది పరబ్రహ్మమం దైక్యము గానేరదు.

హంస నాదబిందుకళలతో మనఃప్రాణంబు లయంబగు యవస్థ తురీయ్యంబనియు, ఉన్మనియనియు, అమనస్కంబనియు, నిర్వికల్పసమాధియనియు జెప్పంబడును.

రేచకపూరకాత్మకమైన హంస మంత్రమును రాత్రింబగలు ధ్యానింపగా బుద్ధి కదలకుండును. ప్రణవనాదములు వినగా చివర ఘంటానాదము వినబడును. లక్ష్యములచే స్వయంజ్యోతి కనబడును. రెండుజాములు నాదబిందుకళలను ధ్యానింప తన్మయత్వంబు గలుగును. మనస్సు నశించును. ఇదియే అమనస్కము.

సాంఖ్యతారకయోగోపాసకులకు మనశ్శుద్ధియు పరబ్రహ్మస్వరూపనిర్ణయము లభించినట్లు అమనస్కనిష్ఠగలవారికి నిరతిశయబ్రహ్మానందము గలుగును.

కొట్టబడకయే మ్రోగుచుండెడు ననాహతమందు శబ్దము పుట్టును. ధ్వని యుండుటవలన శబ్దము గలుగును. ధ్వనియందు వెలుగును. ఆవెలుగునందు మనస్సునున్నది. మనోలీనమైనచో ముక్తి కలుగును, దీనినే యమనస్కమనియు జెప్పుదురు.

## యోగవిషయము.

శ్లో॥ ద్రష్టృదర్శనదృశ్యానాం విరామోయత్రవాభవేత్।
దృష్టిస్తత్రైవకర్తవ్యం ననాసాగ్రవలోకనం॥

గీ. ద్రష్టృదర్శనదృశ్యావిరామమెచట
నగునచటదృష్టినిలుపంగనగునుగాని
చెరరినాసాగ్రమునజూపుజేర్పదగదు
కోరియమనస్కరాజయోగులకువత్సా.

తా. చూచువాడు, చూపు, చూడబడునది యను మూడును విశ్రాంతిని బొందు స్థలము. అనగా రహితమగు తావుననే మనసు నిల్పవలెనుగాని భ్రూమధ్యమందు నిలుపగూడదు. అభ్యాసకులు భ్రూమధ్యమందే నిలుపునది క్రమక్రమముగా నిలుకడ చిక్కినతర్వాత నియమస్థలమును వదిలి పరబ్రహ్మమందే నిలుపవలెను. ఇదియ అమనస్కరాజయోగలక్షణము.

### అచలము.

శ్లో॥ పిండంకుండలినీశక్తిః పదంహంసముదాహృతం।
రూపంబిందురితిజ్ఞేయం రూపాతీతంనిరంజనం॥

అచలమన్నను పరిపూర్ణమన్నను సచ్చిదానందమన్నను పరబ్రహ్మమన్నను మాటల భేదమే కాని అన్య మేమియులేదు. నిర్గుణసాక్షాత్కారపరబ్రహ్మస్వరూపమునకే అచలమనియు, పరిపూర్ణమనియు, సచ్చిదానందమనియు, పరబ్రహ్మమనియు జెప్పుదురు.

### స్త్రీలు.

స్త్రీలకు పాతివ్రత్యమే భూషణము. పాతివ్రత్యమువలన ఇహపరలోకములయందు సన్మానింపబడుటయేగాని ముక్తిలేదు. స్త్రీలు అబలలనియు, అజ్ఞానులనియు తలంచవలదు. స్త్రీలకు జ్ఞానము మెండు గనుక పరబ్రహ్మజ్ఞానమును అతిసూక్ష్మముగ తెలియగలరు.

# ఉపదేశ ప్రకరణము.

## ధ్యానం.

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః।
గురురేకం పరంబ్రహ్మ తస్మైశ్రీగురవేనమః॥

శ్లో॥ అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా।
చక్షురున్మీలితంయేవ తస్మైశ్రీగురవేనమః॥

శ్లో॥ అనేకజన్మసంప్రాప్త కర్మధర్మవిదాహినే।
జ్ఞానానలప్రభావేన తస్మైశ్రీగురవేనమః॥

## ప్రార్థన.

శా. మాయాకారవృతిన్ గుటుంబశిఖితన్మధ్యంబు సంజిక్కితిం
బాయంజాలక తాపకీలలభవత్పాదాబ్జసచ్ఛాయకున్
డాయం జేర్చి కృపామృతంబు మెయినిండం జల్లి పాలింపుమో
శాయామోగ్రనికుంజముల్నరికి వాక్యార్థాసిచే దేశికా.

## బోధ.

శ్లో॥ జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునః పునః।
సంసారసాగరం దుఃఖం తస్మాజ్జాగ్రత జాగ్రత॥

శ్లో॥ ఆశయాబద్ధతేలోకే కర్మణా బహుచింతయేత్।
ఆయుక్షీణం నజానాతి తస్మాజ్జాగ్రత జాగ్రత॥

## ఉపదేశ ప్రకరణము.

శ్లో॥ కామఃక్రోధశ్చలోభశ్చ దేహేతిష్ఠంతితస్కరాః।
జ్ఞానారత్నాపహారాయ తస్మాజ్జాగ్రతజాగ్రత॥

శ్లో॥ మాతానాస్తిపితానాస్తి నాస్తిబంధుసహోదరాః।
అర్థంనాస్తిగృహంనాస్తి తస్మాజ్జాగ్రతజాగ్రత॥

శ్లో॥ అర్థానామార్జనేదుఃఖం మార్జితానాంచరక్షణే।
ఆర్జితాంచవ్యయేదుఃఖం దిగర్థందుఃఖభాజనం॥

శ్లో॥ ఋణానుబంధరూపేణ పశుపత్నిసుతాలయాః।
ఋణక్షయేక్షయంయాంతి కాతత్రపరివేదనా॥

క. నిత్యంబుగానియొడలికి
నిత్యముదుఃఖంబుబడునునిరతముధరలో
నిత్యానందపుపదవికి
నిత్యముదుఃఖంబుబడగనేరరువేమా.

శ్లో॥ అనిత్యానిశరీరాణి విభవోనైవశాశ్వతః।
నిత్యంసన్నిహితోమృత్యుః కర్తవ్యంధర్మసంగ్రహః॥

శ్లో॥ సత్యంమాతాపితాజ్ఞానం ధర్మోభ్రాతృదయాసఖీ।
శాంతిపత్నిక్షమాపుత్ర షడైతేమమబాంధవాః॥

శ్లో॥ సత్సంగత్వేనిస్సంగత్వం నిస్సంగత్వేనిర్మోహత్వం।
నిర్మోహత్వేనిశ్చలతత్వం నిశ్చలతత్వేజీవన్ముక్తిః॥

## ఉపదేశమార్గము.

శా. అంతర్యంబునలక్ష్యమున్ వెలుపలన్నత్యుత్తమాదృష్టిచే
జింతల్ మానినిరంతరంబునిమిషత్సిద్ధిన్ సదాభ్యాసులై
భ్రాంతుల్ బొందకయున్నశాంభవముద్రావీణ్యులూహింతురో
కాంతానీవదిసత్యుగాగనిమదిన్ గాంక్షింపకేయన్యముల్.

సుచియైనస్థలమందు గూర్చొని కృష్ణాజినమైన దర్భాసనమైన పరచుకొని ఆచారం గట్టుకొని గురువును స్మరించి ముఖము కొంచెముగా నెత్తి నల్లగృడ్లుతమాం పైరెప్ప క్రిందికి పామ్యేట్టుగా జేసి అడుగురెప్ప క్రింద ఉండే తెల్లగృడ్లుతమాం వెలుపల కనిపించేటట్టు జేసి అలాగున స్థిరమైన మనస్సు గలవాడై ఈప్రకారము న దినదిన మభ్యాసము చేయగా దృష్టి రెండుజాములకు నిలచేటట్టు అయసాగాఢాంధకారమైన చీకటి యౌను. అందు జూడచూడగా తారకచిహ్నలు కనబడును. అన్ని నష్టమైపోగా పున్నమవెన్నెల గనబడును. ఆ వెన్నెలలోగా సకల లోకములను రక్షించే పరబ్రహ్మము కోటిసూర్యప్రకాశముగా అభిన్నవలయాకృతియై తాలుమూలద్వాదశాంతములనడుమ గానవచ్చును. తాలుమూలద్వాదశాంతములనగా కనుబొమలపైని నాలుగువ్రేళ్ల పొడవుగా నుండేది ద్వాదశాంతము. ఈ నడుమ పరమాత్మ గనపడును. ఆదర్శనమైనప్పుడు పరబ్రహ్మస్వరూపమును బొందును. ఇదే పున్నమదృష్టి, శాంభవీముద్ర, అగ్రావలోకనం. ఇదే రాజయోగము. ఈ రాజయోగమే బ్రహ్మాదులు మొదలైనదేవతలకు జీవనము. ఈ యోగి యెక్కడ యుండినను పరబ్రహ్మస్వరూపుడుగాని సామాన్యుడు గాడు. ఈ యగ్రావలోకనముకంటే యెక్కువైన యోగములు లేవు. ఇదే సకలశాస్త్రములలో యుండేమర్మము. ఇది తెలియక యెన్నిశాస్త్రములు జదివినను ఎంత సాహిత్యపరుడైనను యెన్నియాగాది సత్కర్మలు జేసినను నిష్ఫలముగాని ఫలంలేదు. గాడిద గంధపుచెక్కలను మోయుచు వాసన నెరుంగనట్లు ఇప్పుడు జెప్పిన పున్నమదృష్టిచేతను నీరాజయోగముచేతను నాలుగైదుసంవత్సరములకుగాని కనుపర్చబోలేదు. ఈ రాజయోగముచేత పరమాత్మ యెలాగు దర్శనమా ననగా చంద్రునివలెనే యుండును. చంద్రుడు కాడు సూర్యునివలెనే యుండును. సూర్యుడు కాడు తేజోరూపముగా నుండును. తేజస్సు కాదు ఈ కన్నులదృష్టి లేకనే జ్ఞానదృష్టిని పరమాత్మ గానవచ్చును. ఇందుకు ప్రమాణము.

శ్లో॥ చంద్రంవినాచంద్రకళానుపూర్ణం।
సూర్యంవినాసూర్యమహాప్రకాశం।
తేజంవినాతేజపరస్వరూపం।
నేత్రంవినావర్ణ్యనపద్మనందనం॥

గీ. వన్ను గామరిపవనంబుఫాలమందు
జూనిపిభ్రూయుగమందునజూడమూడ
తామసంబగునిద్రయుదలగద్రోచు
నిద్రయందున నెరచొక్కు నెలవు జెందు

సీ. ఎండ్రెండునన్నియపసిడిచందంబున
బున్నమవెన్నలపోల్కి గాగ
నిలుసవరత్నంబునాభాసరీతిని
వెలుగుదీపంబునవిధముగాను
మిసమిసమెఱసెడుమెఱుపులవలెశచీ
విభునిధనుచ్ఛాయవిధముగాను
మండుమండలరీతిమరియొండచందంబు
మెండైనపొగవలెమిణుగురిట్లు
కదనికమ్మినగాఢాంధకారమువలె
సురులుమునులునుచుక్కలుశుభ్రముగను
నదులుగిరులునుదరువులు నరులు నగుచు
వివిధమాయాదిదృశ్యంబువిశ్వమంత.

సీ. పౌర్ణమిదృష్టిచేబరమాత్మగాంక్షించి
చూడంగనందునసారిదిబుట్టు
చిహ్నలుజెప్పెదజెలువొప్పగావిను
నింద్రధనుచ్ఛాయచంద్రబింబ
ముందుపోలికతారలుండుభాతినివజ్ర
దర్పణభ్రమలచేదనరుచుండు
మెరుగుతీగలచందమరయరత్నంబుల
కాంతినిబంగారుకళలవలెను

గరకమలరీతిసరసులవర్ణప్రకాశ
కారణములుగబహువిధకళలు వెల్గు
నట్టివేళనుదృష్టినిగట్టిపరిచి
నిల్పిజూడంగబ్రణవంబుపల్కుచుండు.

ప్రణవభావము:—గజ్జెలు, తాళం, వేణు, మేఘధ్వని, ఘంట, వీణ, భేరి, మృదంగం, శంఖం, సముద్రములఘోష పదివిధములు.

క. కన్నులదృష్టియుజెదరిన
బన్నుగజిత్తంబుజెదురుపవనముజెదురున్
దిన్నగలక్ష్యముజెదురును
నన్నాగురుదీక్షమొదలినాడేచెదురున్.

ఆ. సూచికాగ్రదృష్టిసారదిభ్రూమధ్యము
జూచిజూచిమరియుజూచెనేని
యాత్మరాకపోకలప్పుడేతెలుసురా
విశ్వదాభిరామవినరవేమా.

ఆ. నాసికంబునడుమన్నలిజూచుయోగికి
వాసివన్నెలేదువసుధలోన
కాసినాథునైనగనగలడాయోగి
విశ్వదాభిరామవినరవేమా.

ఆ. నారపడిగెపామువడిజూచునేర్పున
మూరుక్రిందకాశిజూచువిధము
ఫూరిపుడకయైనతనపుత్రికదపక
పారజూడముక్తిపదమువేమా.

ఆ. పుణ్యపాపములనుపోకుండబంధించి
హంసకొనగజేయుసమదినంబు

నట్టివాడుముక్తినతివేగగైకొను
విశ్వదాభిరామవినరవేమా.

తే. కడగిసంకల్పముల నెల్లగట్టిపెట్టి
చిత్తమునసేమిదలపక చిత్రరూపు
కైవడినియున్నయాతడుఘనుడుతలప
నడవియం దైనబట్టణమం దైనవేమా.

ఆ. కడగిగాలిలేనిగగనంబుభంగిని
జలతరగలులేనిజలధిమాడ్కి
నిర్వికారమునసనునిశ్చలత్వమున
దానుండ నేనిముక్తియొనరువేమా.

ఆ. గాలిలేనిదీపకళికచందంబున
నలలుసుళ్లులేనిజలధిరీతి
నిశ్చలత్వముగనునిర్వికారంబున
నుండ నేనిముక్తియుండుదు వేమా.

ఆ. పగలురేయియనెడిభావంబుమఱచియు
దాను నేననియెడుతలపుమరచి
యుండువానినెంచుయుత్తమయోగిరా
విశ్వదాభిరామవినరవేమా.

సీ. నియమాదిసంగుడైనిలచినతత్వంబు
తామసంబగునిద్రదొలగజేయు
నిద్రతొలంగినిర్భీతి నొందించు
శమమునసానందసమితిపుట్టు
నానందమునవిశ్వమంతయుదానగు
దానువిశ్వంబైనదత్వమగును

తత్వమింద్రియపంచకతత్వంబునను నిల్ప
దత్వంబు నిలిచిన దానయగును
రాజయోగీంద్రుడాతడై తేజరిల్లు
వెలయు జగములవిహరించు విశ్రుతముగ
భానువిధంబునను వృద్ధిపగ దిసోకు
కరణి వెంగిలి క్రియ జూడకు నత వేమా.

సీ. తమతలంపులలోన దత్వశిఖామణి
తలచినవారెల్ల దత్వవిదులు
ఘనమైన నిబిడాంధకారంబునను జ్యోతి
నను వునజూచిన నతడె యోగి
శివునిలో జీవుని జీవునిలో శివు
నొకరి దెలిసిన వారు యోగదృక్కు
సాంఖ్యయోగంబున సర్వంబు శివుడని
నిశ్చయించిన వాడు నిర్మలుండు
ఇట్టిజాడగాక నెందరైనను నేమి
గట్టిగాగ శివుని పట్టగలగ
పొట్టజీవి బాసిపోయి తానుబ్బునా
విశ్వదాభిరామ వినర వేమా.

ఆ. ప్రణవమెరుగనతడు భక్తుడెప్పుడుగాడు
జ్యోతి నెరుగనతడు యోగిగాడు
నిత్యమెరుగనతడు నిర్వాణిగాడయా
విశ్వదాభిరామ వినర వేమా.

ఓ. కడకు నఖిలమునకు నడినాళమందున్న
వేగుచుక్కవంటి వెలుగు దిక్కు

వెలుగుకన్న దిక్కు వేరెవ్వరున్నారు
విశ్వదాభిరామ వినర వేమా.

ఉ. ఎప్పుడు జూచినన్ యితర మేమియు జూడక ముక్తియందు గన్
రెప్పలు మూసి మూయకను రేయు బగల్లొక రీతినుండగా
దప్పులు నొంద జేయు యమధర్మని పాలికి యొంగ నేర్చిన
చెప్పగ నేమి వేమనను జెల్లును ముక్తినిధాన మెన్నగన్.

క. రేచక పూరక కుంభక
సూచకముల రాజయోగ సుస్థిరమతియై
గోచరాపు జూడనొల్లక
వాచాబ్రహ్మంబు వగ గవలదుగ వేమా.

ఆ. తరువ తరువ బుట్టు తరువు ననలంబు
తరువ తరువ బుట్టు దధిని ఘృతము
తలప దలప బుట్టు తనువున తత్వంబు
విశ్వదాభిరామ వినర వేమా

ఆ. ఊరకుంట దెలియనుత్తమ యోగంబు
మానసంబు కలిమి మధ్యమంబు
ఆసనాది విధులు నధమ యోగంబులు
విశ్వదాభిరామ వినర వేమా.

ఆ. కాళ్లు చేతులు రెండు గాలి నిండా నుంచి
నేల గూర్చి కొన్ని నిలచి కొన్ని
ఆసన యోగాలు నభ్యాస విద్యలు
విశ్వదాభిరామ వినర వేమా.

ఆ. ఆసనములు బన్ని యంగంబు బిగియించి
యొడలు విరుచుకొనెడు యోగమెల్ల

జట్టిసాముకన్న జింతాక్షితక్కువ
విశ్వదాభిరామవినర వేమా.

ఆ. ఆత్మయందుజ్యోతియమరుటలింగంబు
దెలిసిచూడగాను దేటపడును
యదియుగురువు లేక యబ్బునా తెలియంగ
విశ్వదాభిరామవినర వేమా.

ఆ. గురువు లేకవిద్యగురుతుగాదొరకదు
నృపతి లేకభూమిత్రప్తిగాదు
గురువువిద్య లేకగురుతరద్విజుడౌనె
విశ్వదాభిరామవినర వేమా.

క. గురునికటాక్షము లేకను
పరమేశుండీయడుముక్తపద మెవ్వరికిన్
గురు లేనికోలనేసిన
గురినాటకపోవుకరణిగొనకును వేమా.

గురువుల లక్షణములు వగైరాలు.

క. గురుడనగాపరమాత్ముడు
పరగంగాశిష్యుడనగబట్టుజీవుడగున్.
గురుశిష్యజీవసంపద
గురుతరముగగూర్చునతడుగురువగు వేమా.

శ్లో॥ గుకారశ్చగుణాతీతో రూపాతీతో రుకారకః।
గుణరూపవిహీనత్వా ద్గురురిత్యభిధీయతే॥

శ్లో॥ గుకారశ్చాంధకారస్తు రుకారస్తన్నిరోధకృత్।
అంధకారవినాశిత్వా ద్గురురిత్యభిధీయతే॥

శ్లో॥ గురవోబహవస్సంతి శిష్యవిత్తాపహారకాః।
తామేకందుర్లభంమన్యే శిష్యహృత్తాపహారకం॥

ఆ. కల్లగురుడుగట్టునెల్లకర్మంబులు
మధ్యగురుడుగట్టుమంత్రచయము
ఉత్తముండుగట్టుయోగసామ్రాజ్యంబు
విశ్వదాభిరామవినరవేమా.

క. గురుడజుడుగురుడువిష్ణుడు
గురుడుమహాదేవుడఖిలగురుడుగురుడున
గ్గురుడెపరబ్రహ్మంబని
గురునినుపాసించునతడుగురుతరభక్తిన్.

శ్లో॥ గురుపాదోదకంపీత్వా గురోరుచ్ఛిష్టభోజనం।
గురుమూర్తిసదాధ్యాయేత్ గురుస్తోత్రంసదాజపేత్॥

సీ గురుపదాంభోజముల్గొలువకకల్గునే
ప్రవిమలవైరాగ్యభాగ్యమహిమ
గురుపాదతీర్థంబుగ్రోలకగల్గునే
జ్ఞానవిజ్ఞానయోగానుభవము
గురునుప్రసాదంబుగొనకున్నగల్గునే
ప్రతిలేనిచిత్తోపరతిసుఖంబు
గురుతత్వమాత్మగన్గొనకున్నగల్గునే
నిరతిశయంబైనపరమపదము
అట్లుగావునవిద్యార్థియైనయోగి
వినయభయభక్తులెదలోనబెనగొనంగ
నలచతుర్విధశిశ్రూషలాచరించికొనుచు
ననిశంబుగురువులగొలుచుననఘా.

కందార్థము. గురుశిశ్యాపయొస్కర్చుట
యెరిగించెద నట్టులనిసనేర్పడవినుమిా
సరులిష్టదైవమునకుం
బరిచర్యయొనర్చునట్లుభక్తితోడుతనూ
గురుమూర్తికత్యు క్తితోడుతనూ
నిరతమరమర లేకనీవుసల్పితివేని
గురుబోధమరుగుసద్గురునిచే దెలిసేవుభక్తితోడుతనూ
గురుమూర్తికత్యు క్తితోడుతను.

కందార్థము. దేశకునిచరణతీర్థము
కాశీగంగయనిగురునిగనుగొన్ననువి
శ్వేశుండనితనకునుయుప
దేశంబొనరించునట్టి దేతారకమనీ
మనసందుతానీతీరుగానీ
యేసీమయందున్నా కాశీప్రయాగరామేశుని
పురమైప్రకాశించునాసీమయ దేతారకమనీ
మనసందుతానీతీరుగానీ.

శ్లో॥ సంసారసాగరసముద్ధీరణైకమంత్రం।
బ్రహ్మాదిదేవమునిపూజితసిద్ధమంత్రం।
దారిద్ర్యదుఃఖభవరోగవినాశమంత్రం।
వందేమహాభయహరంగురురాజమంత్రం॥

ఆ. కాకిగూటిలోనగోకిలమున్నట్లు
భ్రమరమగుచుపురుగుబ్రతికినట్లు
—గురునిగొల్చువెనుకగురువుతానౌనయా
విశ్వదాభిరామవినరవేమా.

## సచ్ఛిష్యుని లక్షణము.

కందార్థము. సతిపొరుగూరికిపోయిన
పతిరాకడగోరినట్లు భావములోనన్
మతిమంతుడుసచ్ఛిష్యుడు
సతతముగురు రాకగోరుసత్యమువినరా
వానితోటిసాటెవ్వరనరా
హితుని రాకడకుస్నేహితుడుగోరినయట్లు
అతిదరిద్రుడుద్రవ్యతతినిగోరినయట్లు
సత్యమువినరా వానితోటిసాటెవ్వరనరా.

## కుత్సితశిష్యుని లక్షణము.

కందార్థము. కుటిలాత్ముడైనశిష్యుం
డిట్టువలెతాబల్కు గురుడుయింటికిరాగా
యెటుబోవుచుండిరాకో
యిటకికదర్శనముమళ్లియెప్పుడయ్యేనో
యెవరికిదెలుసుయెప్పుడేమౌనో
యెటుదోచదేమైనయుత్తమంచనుకొంటే
తటుకునవకరాగిదుష్టయిన లేదిపుడెప్పుడయ్యేనో
యెవరికిదెలుసుయెప్పుడేమౌనో.

ఆ. గుణవంతునకు మేలుగోరంత జేసిన
కొండయౌను వానిగుణముచేత
కొండకొలది మేలుగుణహీనుడేమెరుగు
విశ్వదాభిరామవినరవేమ.

ఆ. ఇంతవగవనేల యేకాంత్రబుద్ధిని
హరిహరాదులందు యాశలుడిగి
శాంతబుద్ధినుండ సమకూరుసుఖంబు
విశ్వదాభిరామ వినర వేమా.

కందార్థము. పుట్టింటబిక్షబహుగా
దిట్టయియుండినను నెవరుదిట్టరు భువిలో
బుట్టింటివారికోడలు
దిట్టయినయత్తవారుదిట్టరుసుమ్మీ
చేతులకొద్దికొట్టరుసుమ్మీ
అటువలె నేబహుదిట్టయినశిష్యుని
తిట్టడుగురుమూర్తివట్టివాగుచాలాతిట్టెగసుమ్మీ
చేతులకొలదికొట్టెనుసుమ్మీ.

ఆ. నిజములాడువానినిందించుజనమెల్ల
నిజములాడరాదు నీచుతోడ
నిజమహాత్ముగూడినిజమాడవలయురా
విశ్వదాభిరామ వినర వేమా.

సుతిః

సీ. వారణాసిపురంబు చేరియుండెడిగంగ
సాటియగురుపాదజలముమహిమ
విశ్వేశ్వరునితోడ వెలయసమానమా
గురుమూర్తిరూపవిస్ఫురణమహిమ
పరగంగనాయకుపటముతో దుల్యమా
శిరమునార్యాంఘ్రుల జేర్చుమహిమ

పానంబుపట్లప్రయాగతీర్థముబోలు
గురుణాపరత్వసద్గురునిమహిమ
యెన్నివిధములగురుబలమెచ్చుగాన
నిరతమాత్మలోనెంచినంస్మరణజేసి
కోరినిరుపమసత్యాత్మజేరుకొరకు
వ్యాప్తినడగించియోన్నమోయనినుతింతు.

సీ. జయనిర్మలాకారజయభక్తమందార
జయనిర్వికారసంశయవిదూర
జయసత్కృపాలోలజయపుణ్యసంసీల
జయసత్యఖేలదుర్జనవిఫాల
జయఘోరభవనాశజయసర్వలోకేశ
జయభిదాకాశశశ్వత్ప్రకాశ
జయసచ్చిదానందజయపావనముకుంద
జయసదానందసుజ్ఞానకంద
జయశివస్వాంతమానివృత్తిసన్నిశాంత
జయసుధాలాపపరమహంసస్వరూప
జయసముల్లాసమోక్షయోషావిలాస
జయతుగురురాయభక్తసజ్జనవిధేయ

నమస్కృతి.

శ్లో॥ నమస్తేనమస్తేసదానందభూతే।
నమస్తేనమస్తేసదామోక్షపాణే।
నమస్తేనమస్తేసదాశాంతమూర్తే।
నమస్తేనమస్తేనమస్తేమహేశ॥

## మంగళం.

శ్లో॥ మంగళంగురుదేవాయ మహనీయగుణాత్మనే।
సర్వలోకశరణ్యాయ సాధురూపాయమంగళం॥

తే. మంగళమునీకుసర్వేశ మంగళంబు
మంగళమునీకుపరిపూర్ణ మంగళంబు
మంగళమునీకునశ్రాంత మంగళంబు
మంగళమునీకునక్షయమంగళంబు.

# శ్రీశివపంచాక్షరీ ధ్యానశ్లోకః.

శ్లో॥ ఓంకారసంధ్యాతసమస్తదేవా పురాణపుణ్యాగమపూజితాయ।
ఓంకారవర్ణత్రయదర్శితాయ ఓంకారరూపాయనమఃశివాయ॥ 1

శ్లో॥ నానాజనవ్యాధివినాశనాయ నానాధిలోకాయజగద్ధితాయ।
నానాదిగిజ్ఞానసుదర్శితాయ తస్మిన్నకారాయనమఃశివాయ॥ 2

శ్లో॥ మాత్సర్యగేసిద్ధఫలప్రదాయ మాతాపితాజన్మవిమోచనాయ।
మహేశ్వరాయసూక్ష్మతరాయ తస్మిన్మకారాయనమఃశివాయ॥ 3

శ్లో॥ శివేమతిజ్ఞానఫలప్రదాయ శీతాంశురసాయశిఖేజటాయ।
శివాయనిత్యంశివమస్తుతాయ తస్మిన్శికారాయనమఃశివాయ॥ 4

శ్లో॥ వావార్థకించఫలప్రదాయ వాచర్మణాకర్మనిరామలాయ।
వావానరీదివ్యతాభవాయ తస్మిన్వకారాయనమఃశివాయ॥ 5

శ్లో॥ యత్సర్వగేసిద్ధఫలప్రదాయ యజ్ఞానగోత్రాయనిరాకులాయ।
యస్మిన్లోకాయజగద్ధితాయ తస్మిన్యకారాయనమఃశివాయ॥ 6

## ధ్యానం.

శ్లో॥ వందేశంకరమర్థచంద్రసహితం వందేభుజంగాంగదం।
వందేమారహరంపురత్రయజయం వందేగణానాంపతిం।
వందేభస్మవిలేపనమ్త్రినయనం వందేసురేశప్రియం।
వందేభక్తజనాశ్రయంచరదం వందేశివంశంకరం॥

# శ్రీశివకవచస్తోత్రం.

అస్య శ్రీశివకవచస్తోత్ర మహామంత్రస్య ఋషభ యోగీశ్వరఋషిః।
అనుష్టుప్ఛందః శ్రీసాంబసదాశివో దేవతా।
ఓంబీజం నమఃశక్తిః శివాయేతికీలకం।
మమ శ్రీసాంబసదాశివ ప్రీత్యర్థే జపేవినియోగః॥

## అథకరన్యాసః.

ఓం. సదాశివాయ - అంగుష్ఠాభ్యాన్నమః।
నం. గంగాధరాయ - తర్జనీభ్యాన్నమః।
మం. మృత్యుంజయాయ - మధ్యమాభ్యాన్నమః।
శిం. శూలపాణయే - అనామికాభ్యాన్నమః।
వాం. పినాకపాణయే - కనిష్ఠికాభ్యాన్నమః।
యం. ఉమాపతయే - కరతలకరపృష్ఠాభ్యాన్నమః॥

## అథహృదయాదిన్యాసః.

ఓం. సదాశివాయ - హృదయాయనమః।
నం. గంగాధరాయ - శిరసేస్వాహా।
మం మృత్యుంజయాయ - శిఖాయైవషట్।
శిం. శూలపాణయే - కవచాయహుం।
వాం. పినాకపాణయే - నేత్రత్రయాయవౌషట్।
యం. ఉమాపతయే - అస్త్రాయఫట్।
భూర్భువస్సువరోమితిదిగ్బంధః॥

## ధ్యానం.

శ్లో॥ వజ్రదంష్ట్రం త్రినయనం కాలకంఠమరిందమమ్।
సహస్రకరమత్యుగ్రం వందే శంభుముమాపతిం।
రుద్రాక్షకంకణలసత్కరదండయుగ్మః।
ఫాలాంతం శశితభస్మధృతత్రిపుండ్రః।
పంచాక్షరం పరిపఠన్ వరమంత్రరాజం।
ధ్యాయన్సదా పశుపతిం శరణమ్వ్రజేథాః।
అథాపరం సర్వపురాణగుహ్యం।
నిశ్శేషపాపౌఘహరంపవిత్రం।
జయప్రదంసర్వవిపత్ప్రమోచనం।
వక్ష్యామి శైవం కవచం హితాయ తే॥

ఋషభోవాచా॥ నమస్కృత్వా మహాదేవం।
విశ్వవ్యాపినమీశ్వరం।
వక్ష్యే శివమయం వర్మ।
సర్వరక్షాకరం నృణామ్॥

శ్లో॥ శుచౌ దేశే సమాసీనో యథావత్కల్పితాసనః।
జితేంద్రియో జితప్రాణ శ్చింతయేచ్ఛివమవ్యయం।
హృత్పుండరీకాంతరసన్నివిష్టం।
స్వతేజసా వ్యాప్తనభోవకాశం।
అతీంద్రియం సూక్ష్మమనంతమాద్యం।
ధ్యాయేత్పరానందమయం మహేశం।
ధ్యానావధూతాఖిలకర్మబంధః।
శ్చిరంచిదానందనిమగ్నచేతాః।

షడక్షరంన్యాససమాహితాత్మా।
శైవేనకుర్యాత్కవచేనరక్షాం।
మాంపాతుదేవోఽఖిలదేవతాత్మా।
సంసారకూపేపతితంగభీరే।
త్వన్నామదివ్యంపరమంత్రమూలం।
ధునోతుమేసర్వమఘంహృదిస్తమ్।
సర్వత్రమాంరక్షతువిశ్వమూర్తి।
ర్జ్యోతిర్మయానందఘనశ్చిదాత్మా।
అణోరణీయానురుశక్తిరేకస్సయీశ్వరః।
పాతుభయాదశేషాత్।
యోభూస్వరూపేణబిభర్తివిశ్వం।
పాయాత్సభూమేర్గిరిశోఽష్టమూర్తిః।
యోఽపాంస్వరూపేణనృణానమ్।
కరోతిసంజీవనంసోఽవతుమాంజలేభ్యః।
కల్పావసానేభువనానిదగ్ధ్వా।
సర్వాణియోనృత్యతిభూరిలీలః।
సకాలరుద్రోఽవతుమాందవాగ్నే।
ర్వాత్యాదిభీతేరఖిలాచ్చతాపాత్।
ప్రదీప్తవిద్యుత్కనకావభాసో।
విద్యావరాభీతికుఠారపాణిః।
చతుర్ముఖస్తత్పురుషస్త్రినేత్రః।
ప్రాచ్యాంస్థితోరక్షతుమామజస్రమ్।
కుఠారఖేటాంకుశపాశశూల।
కపాలమాలాగ్నికణాందధానః।

చతుర్ముఖోనీలరుచిస్త్రినేత్రః
పాయాదఘోరోదిశిదక్షిణస్యామ్।
కుందేందుశంఖస్ఫటికావభాసో
వేదాక్షమాలావరదాభయాంకః।
త్ర్యక్షశ్చతుర్వక్త్రఉరుప్రభావ।
స్సద్యోధిజాతోవతుమాంప్రతీచ్యామ్।
వరాక్షమాలాభయటంకహస్త।
స్సరోజకింజిల్కసమానవర్ణః।
త్రిలోచనశ్చారుచతుర్ముఖోమాం।
పాయాదుదీచ్యాందిశివామదేవః।
వేదాభయేష్టాంకుశటంకపాశ।
కపాలఢక్కాక్షరశూలపాణిః।
సితద్యుతిఃపంచముఖోవతాన్మా।
మీశానఊర్ధ్వంపరమప్రకాశః।
మూర్ధానమవ్యాన్మమచంద్రమౌళిః।
ఫాలంమమావ్యాదథఫాలనేత్రః।
నేత్రేమమావ్యాద్భగనేత్రహారీ।
నాసాంసదారక్షతువిశ్వనాథః।
పాయాచ్ఛ్రుతీమేశ్రుతిగీతకీర్తిః।
కపోలమవ్యాత్సతతంకపాలీ।
వక్త్రంసదారక్షతుపంచవక్త్రో।
జిహ్వాంసదారక్షతువేదజిహ్వః।
కంఠంగిరీశోవతునీలకంఠో।
వక్షస్థలందక్షమఖాంతకోవ్యాత్ ।

దోర్మూలమవ్యాన్మమధర్మబాహుః।

పాణిద్వయంపాతుపినాకపాణిః।

మమోదరంపాతుగిరీంద్రధన్వా।

మధ్యంమమావ్యాన్మదనాంతకారీ।

హేరంబతాతోమమపాతునాభిం।

పాయాత్కటింధూర్జటిరీశ్వరోమే।

స్మరారిరవ్యాన్మమగుహ్యదేశం।

పృష్ఠంసదారక్షతుపార్వతీశః।

ఊరుద్వయంపాతుకుబేరమిత్రో।

జానుద్వయంమేజగతీశ్వరోవ్యాత్।

జంఘాయుగంపుంగవకేతురవ్యా।

త్పాదౌమమావ్యాత్సురవంద్యపాదః।

మహేశ్వరఃపాతుదినాద్యయామే।

మాంమధ్యయామేవతువామదేవః।

త్రియాంబకఃపాతుతృతీయయామే।

వృషధ్వజఃపాతుదినాంత్యయామే।

పాయాన్నిశాదౌశశిశేఖరోమాం।

గంగాధరోరక్షతుమాంనిశీథే।

గౌరీపతిఃపాతునిశావసానే।

మృత్యుంజయోరక్షతుసర్వకాలం।

అంతస్స్థితంరక్షతుశంకరోమాం।

స్థాణుస్సదాపాతుబహిస్స్థితంమాం।

తదంతరేపాతుపతిఃపశూనాం।

సదాశివోరక్షతుమాంసమంతాత్।

తిర్యంతమవ్యాద్భువనైకనాథః।
పాయాద్వ్రిజంతం ప్రమథాదినాథః।
వేదాంతవేద్యోవతుమాం
నిషణ్ణంమామవ్యయఃపాతుశివశ్శయానం।
మార్గేషుమాంరక్షతువీరరుద్ర।
శ్శైలాదిదుర్గేషుపురత్రయారిః।
అరణ్యవాసాదిమహాప్రవాసే।
పాయాన్మృగవ్యాధఉదారశక్తిః।
కల్పాంతకాలోగ్రపటుప్రకోప।
స్స్ఫుటాట్టహాసోచ్చలితాండకోశః।
ఘోరారిసేనార్ణవదుర్నివార।
మహాభయాద్రక్షతువీరభద్రః।
పత్త్యశ్వమాతంగఘటావరూథిసీ।
సహస్రలక్షాయుతకోటిభీషణం।
అక్షౌహిణీనాంశతమాతతాయినాం।
ఛింద్యాన్మృడోఘోరకుఠారధారయా।
నిహంతిదస్యూన్ప్రళయానలార్చిర్జ్వలత్త్రిశూలం।
త్రిపురాంతకస్యశార్దూలసింహర్క్షవృకాదిహింస్రాన్।
సంత్రాసయంత్వీశధనుఃపినాకః।
దుస్స్వప్నదుశ్శకునదుర్గతిదౌర్మనస్య।
దుర్భిక్షదుర్వ్యసనదుస్సహదుర్యశాంసి।
ఉత్పాతతాపవిషభీతిమసద్గ్రహార్తీన్।
వ్యాధీంశ్చనాశయతమేజగతామధీశః॥

ఓంనమోభగవతేసదాశివాయ, సకలతత్వాత్మకాయ సకలతత్వవిదూరాయ
సకలలోకైకకర్త్రే సకలలోకైకభర్త్రే సకలలోకైకహర్త్రే సకలలోకైకసంహర్త్రే
సకలలోకైకగురవే సకలలోకైకసాక్షిణే సకలనిగమగుహ్యాయ సకలలోకైకవర
ప్రదాయ సకలదురితార్తిభంజనాయ సకలజగదభయంకరాయ శశాంకశేఖరాయ
శాశ్వతనిజావాసాయ నిరావాసాయ నిరాసాభాయ నిరామయాయ నిరాంతకాయ
నిష్కళంకాయ నిష్ప్రపంచాయ నిర్ద్వంద్వాయ నిస్సంగాయ నిర్మమాయ నిర్మలాయ
నిర్గుణాయ నిరాధారాయ నిరుపమవిభవాయ నిత్యశుద్ధబుద్ధపరిపూర్ణసచ్చిదానందా
ద్వైతపరమప్రకాశాయ పరమశాంతప్రకాశాయ తేజోరూపాయ తేజోమయాయ
తేజోధిపతయే జయజయరుద్ర మహారుద్ర మహారౌద్ర వీరభద్రావతార మహాభైరవ
కల్పాంతభైరవ కపాలమాలాధరఖట్వాంగ చర్మఖడ్గపరశుపాశాంకుశడమరుకమృగశూల
చాపబాణగదాశక్తిభిండివాల తోమరముసలముసుంఠిముద్గరప్రాసపరిఘపట్టసశతఘ్ని
చక్రాద్యాయుధభీషణాకరసహస్రదంష్ట్రాకరాళవదన వికటాట్టహాస విస్ఫారిత
బ్రహ్మాండమండల నాగేంద్రకుండల నాగేంద్రహార నాగేంద్రవలయ నాగేంద్రచర్మ
ధరమృత్యుంజయ త్ర్యయంబక త్రిపురాంతకవిరూపాక్ష విశ్వేశ్వర వృషవాహన
వృషభూషణ విశ్వరూప విశ్వతోముఖ సర్వతోముఖమాంరక్షరక్ష జ్వలజ్వలప్రజ్వల
మహామృత్యు మపమృత్యు భయంనాశాయ నాశయరోగభయ ముత్సాదియోత్సా
దయ విషసర్పభయం శమయశమయచోరాన్మారయ మారయమమశత్రూనుచ్చాట
యోచ్చాటయ శూలేనవిదారయ విదారయకుఠారేణ భిన్ధిభిన్ధిఖడ్గేనభిన్ధిభిన్ధి ఖట్వాం
గేనవ్యపోధయ వ్యపోధయమమపాపంశోధయ శోధయముసలేననిష్పేషయ నిష్పే
షయబాణైసన్తాడయ సన్తాడయయక్షరక్షాంసిభీషయ భీషయభూతానివిద్రావయ
విద్రావయకూష్మాండభూతభేతాళమారీచబ్రహ్మరాక్షసగణాంత్సంత్రాసయ సంత్రా
సయమమాభయంకురుకురువిత్రస్తంమామాశ్వాసయా శ్వాసయదుఃఖాతురంమామా
నందయా నందయాక్షుత్తృష్ణార్తంమామాప్యాయ యాప్యాయయ అమృతకటాక్షవీక్ష
ణేనమామాలోకయా లోకయమాంసంజీవయ సంజీవయనరకభయాన్మాముద్ధరోద్ధర
శివకవచేనమామాచ్ఛాదయా చ్ఛాదయమృత్యుంజయత్ర్యయంబక సదాశివ పరమ
శివ నమస్తే నమస్తే॥

శ్లో॥ ఇత్యేతత్పరమం శైవం కవచంవ్యాహృతంమయా।
సర్వబాధాప్రశమనం రహస్యంసర్వదేహినామ్।

యస్సధారయేన్మర్త్య శ్శైవంకవచముత్తమమ్।
నతిస్యజాయతేక్వాపి భయంశంభోరనుగ్రహాత్।
క్షీణాయుఃప్రాప్తమృత్యుర్వా మహారోగహతోపివా।
సద్యస్సుఖమవాప్నోతి దీర్ఘమాయుశ్చవిందతి।
సర్వదారిద్ర్యశమనం సర్వమంగళవర్ధనమ్।
యోధత్తేకవచంశైవం సదేవైరపిపూజ్యతే।
మహాపాతకసంఘాతై ర్ముచ్యతేచోపపాతకైః।
దేహాంతేముక్తిమాప్నోతి శివవర్మానుభావతః।
త్వమపిశ్రద్ధయావత్స శైవంకవచముత్తమమ్।
ధారయస్వమయాదత్తం సద్యశ్శ్రేయోహ్యవాప్స్యసి॥
శ్రీసూతః.—ఇత్యుక్త్వాఋషభోయోగీ తస్మైపార్థివసూనవే।
దదౌశంఖంమహారావం ఖడ్గంచారినిషూదనం।
పునశ్చభస్మసంమంత్ర్య తదంగంపరితస్పృశన్।
గజానాంషట్సహస్రస్య ద్విగుణస్వబలందదౌ॥
సూతః.—భస్మప్రభావాత్సంప్రాప్త బలైశ్వర్యధృతిః స్మృతిః।
సరాజపుత్రశ్శుశుభే శరదర్క-ఇవశ్రియా।
తమాహప్రాంజలింభూయ స్సయోగన్నృపనందనమ్।
ఏషఖడ్గోమయాదత్త స్తపోమంత్రానుభావతః।
సితధారమిమంఖడ్గం యస్మైదర్శయతేస్ఫుటం।
ససద్యోమ్రియతేశత్రు స్సాక్షాన్మృత్యురపిస్వయమ్।
ఏషశంఖోమయాదత్త స్తపోమంత్రానుభావతః।
అస్యశంఖస్యనిర్హ్రాదం యేశృణ్వంతితవాహితాః।
తేమూర్ఛితాఃపతిష్యంతి న్యస్తశస్త్రావిచేతనాః।
ఖడ్గశంఖావిమౌదివ్యౌ పరసైన్యవినాశనౌ।

ఆత్మసైన్యస్వపక్షాణాం శౌర్యతేజోవివర్ధనమ్।
ఏతయోశ్చప్రభావేనా శైవేనకవచేనచ।
ద్విషట్సహస్రనాగానాం బలేనమహతాపిచ।
భస్త్రధారణసామర్థ్యా చ్ఛత్రుసైన్యంవిజేష్యసి।
ప్రాప్యసింహాసనంపిత్ర్యం గోప్తాసిపృథివీమిమామ్।
ఇతిభద్రాయుషంసమ్య గనుశాస్యసమాతృకం।
తాభ్యాంసంపూజితస్తేథ యోగీస్వైరగతిర్యయౌ॥

ఇతి శ్రీస్కాందే మహాపురాణే బ్రహ్మోత్తరఖండే శివకవచోపదేశం

నామద్వాదశోధ్యాయః॥

# శ్రీశివాష్టోత్తర శతనామశ్లోకః.

శ్లో॥ శివోమహేశ్వరశ్శంభుః పినాకీశశిశేఖరః।
వామదేవోవిరూపాక్షః కపర్దీనలలోహితః॥ 1

శ్లో॥ శంకరశ్శూలపాణిశ్చ ఖట్వాంగీవిష్ణువల్లభః।
శిపివిష్టోంబికానాథః శ్రీకంఠోభక్తవత్సలః॥ 2

శ్లో॥ భవశ్శర్వస్త్రిలోకేశ శ్శితికంఠశ్శివాప్రియః।
ఉగ్రఃకపర్దీకామారి రంధకాసురసూదనః॥ 3

శ్లో॥ గంగాధరోలలాటాక్షః కాలకాలఃకృపానిధిః।
భీమపరశుహస్తస్య మృగపాణిర్జటాధరః॥ 4

శ్లో॥ కైలాసవాసీకవచీ కఠోరస్త్రిపురాంతకః।
వృషాంకోవృషభారూఢో భస్మోద్ధూళితవిగహః॥ 5

శ్లో॥ సామప్రియస్స్వరమయ స్త్రయీమూర్తిరనీశ్వరః।
సర్వజ్ఞఃపరమాత్మాచ సోమసూర్యాగ్నిలోచనః॥ 6

శ్లో॥ హవిర్యజ్ఞమయస్సోమః పంచవక్త్రస్సదాశివః।
విశ్వేశ్వరోవీరభద్రో గణనాథఃప్రజాపతిః॥ 7

శ్లో॥ హిరణ్యరేతాదుర్ధర్షో గిరీశోగిరిశోనఘః।
భుజంగభూషణోభర్గో గిరిధన్వాగిరిఃప్రియః॥ 8

శ్లో॥ కృత్తివాసాఃపురారాతి ర్భగవాన్ప్రమథాధిపః।
మృత్యుంజయస్సూక్ష్మతను ర్జగద్వ్యాపీజగద్గురుః॥ 9

శ్లో॥ వ్యోమకేశోమహాసేన జనకశ్చారువిక్రమః।
రుద్రోభూతపతిస్థాణు రహిర్బుధ్నో దిగంబరః॥ 10

శ్లో॥ అష్టమూర్తిరనేకాత్మా సాత్వికశ్శుద్ధవిగ్రహః।
శాశ్వతఃఖండపరశు రజఃపాశవిమోచకః॥ 11

శ్లో॥ మృడఃపశుపతిర్దేవో మహాదేవోవ్యయోహరః।
పూషదంతభిదవ్యగ్రో దక్షాధ్వరహరోహరః।
భగనేత్రభిదవ్యక్త సహస్రాక్షస్సహస్రపాత్॥ 12

శ్లో॥ అపవర్గప్రదోనంత స్తారకఃపరమేశ్వరః।
ఏవంశ్రీశంభుదేవస్య నామ్నామష్టోత్తరంశతం।
పఠతిశ్రద్ధయాయస్తు శ్శివలోకేమహీయ్యతే॥ 13

ఇతి శ్రీశివాష్టోత్తర శతనామశ్లోకాః.

---

# శ్రీసూర్యకవచస్తోత్రం.



శ్లో॥ అస్య శ్రీసూర్యకవచ స్తోత్రమహామంత్రస్య।
కణ్వాఋషిః అనుష్టుప్ఛన్దః శ్రీసూర్యనారాయణోదేవతా।
మమసూర్యనారాయణప్రసా దసిద్ధ్యర్థేజపేవినియోగః॥

ధ్యానమ్.— దేవాసురనరైః-రర్ఘ్యం గృహైశ్చపరిశేవితం।
ధ్యాయేత్పరేతుస్వర్ణాభం శ్రీసూర్యకవచంసదా॥

శ్లో॥ అధునాసంప్రవక్ష్యామి కవచంసర్వకామదమ్।
ఇదంతుకవచంబుధ్వా విచరేద్వీరభైరవః॥

శ్లో॥ ఘృణిఃపాతుశిరోదేశం సూర్యఃపాతులలాటకం।
ఆదిత్యోలోచనేపాతు శ్రుతీపాతుదివాకరః॥

శ్లో॥ ఘ్రాణంపాతుసదాభానుః ముఖంపాతుసదారవిః।
జిహ్వాంపాతుజగన్నేత్రః కంఠంపాతువిభావసుః॥

శ్లో॥ స్కంధౌగ్రహాపతిఃపాతు భుజౌపాతుప్రభాకరః।
కరావుష్ణకరఃపాతు హృదయంపాతుభానుమాన్॥

శ్లో॥ మధ్యంపాతుచసప్తాశ్వో నాభింపాతునభోమణిః।
ద్వాదశాత్మాకటింపాతు సవితాపాతుసక్థినీ॥

శ్లో॥ ఊరూపాతుసురశ్రేష్ఠో జానునీపాతుభాస్కరః।
జంఘేమేపాతుమార్తాండో గుల్ఫౌపాతుత్విషాంపతిః॥

శ్లో॥ పాదౌదినమణిఃపాతు పాతుమిత్రోఖిలంవపుః।
యఇదంసూర్యకవచం పురుషార్థప్రదంనృణాం॥

శ్లో॥ సతతం ప్రాతరుత్థాయ పఠేన్నియతమానసః।
నసురాణామపిశ్లాఘ్యః శ్లాఘ్యాబుద్ధిమతామపి॥
శ్లో॥ సర్వకామమవాప్నోతి సూర్యసాయుజ్యమాప్నుయాత్।
గ్రహారోగభయాత్పావాన్ ముచ్యతేనాత్రసంశయః॥
శ్లో॥ ఆదిత్యకవచంపుణ్య మభేద్యంవజ్రసన్నిభం।
సర్వరోగభయాదిభ్యో ముచ్యంతేనాత్రసంశయః॥
శ్లో॥ సంవత్సరముపాసిత్వా సామ్రాజ్యపదవీంలభేత్।
అనేకరత్నసంయుక్తం స్వర్ణాభరణభూషితం॥
శ్లో॥ కల్పవృక్షసమాకీర్ణం కదంబకుసుమప్రభం।
అశేషరోగశాంత్యర్థం ధ్యాయేదాదిత్యమండలమ్॥

ఇతి సూర్యకవచం సమాప్తం.

# శ్రీ సూర్యాష్టకమ్.

సాంబ ఉవాచ.

ఆదిదేవనమస్తుభ్యం ప్రసీదమమభాస్కర।
దివాకరనమస్తుభ్యం ప్రభాకరనమోస్తుతే॥ 1

సప్తాశ్వరథమారూఢం ప్రచండంకశ్యపాత్మజమ్।
శ్వేతపద్మధరందేవం తంసూర్యంప్రణమామ్యహమ్॥ 2

లోహితంరథమారూఢం సర్వలోకపితామహమ్।
మహాపాపహరందేవం తంసూర్యంప్రణమామ్యహమ్॥ 3

త్రైగుణ్యంచమహాశూరం బ్రహ్మావిష్ణుమహేశ్వరమ్।
మహాపాపహరందేవం తంసూర్యంప్రణమామ్యహమ్॥ 4

బృంహితంతేజఃపుంజంచ వాయురాకాశమేవచ।
ప్రభుత్వంసర్వలోకానాం తంసూర్యంప్రణమామ్యహమ్॥ 5

బంధూకపుష్పసంకాశం హారకుండలభూషితమ్।
ఏకచక్రధరందేవమ్ తంసూర్యంప్రణమామ్యహమ్॥ 6

తంసూర్యంలోకకర్తారం మహాతేజఃప్రదీపనమ్।
మహాపాపహరందేవం తంసూర్యంప్రణమామ్యహమ్॥ 7

తంసూర్యంజగతాంనాథం జ్ఞానప్రకాశమోక్షకం।
మహాపాపహరందేవం తంసూర్యంప్రణమామ్యహమ్॥ 8

సూర్యాష్టకంపఠేనిత్యం గ్రహపీడాప్రణాశనమ్।
అపుత్రోలభతేపుత్రం దరిద్రోధనవాన్భవేత్॥ 9

అమిషంమధుపానంచ యంకరోతిరవేర్దినే।
సప్తజన్మభవేద్రోగీ జన్మజన్మదరిద్రతా॥ 10

స్త్రీతైలమధుమాంసాని యేత్యజంతిరవేర్దినే।
నవ్యాధిశ్శోకదారిద్ర్యం సూర్యలోకంచగచ్ఛతి॥ 11

ఇతి సాంబపురాణే రోగాపనయనే సూర్యాష్టకం సమాప్తిః.

# జపాసనముల ఫలములు.

---

శ్లో॥ శుక్లంసర్వత్రవైప్రోక్తం వశ్యేరక్తాసనంప్రియే।
పద్మాసనేజపేన్నిత్యం శాంతివశ్యకరంపరం॥

శ్లో॥ వస్త్రాసనేచదారిద్ర్య పాషాణేరోగసంభవః।
మేదిన్యాందుఃఖమాప్నోతి కాష్ఠేభవతినిష్ఫలం॥

శ్లో॥ కృష్ణాజినేజ్ఞానసిద్ధి మోక్షశ్రీర్వ్యాఘ్రచర్మణి।
కుశాసనేజ్ఞానసిద్ధిః సర్వసిద్ధిస్తుకంబళే॥

తెల్లని ఆసనము—ప్రసిద్ధమైనది.

ఎఱ్ఱని ఆసనము—జనస్వాధీనము.

పద్మాసనము—శాంతముగా మిక్కిలి జనమును స్వాధీనము.

వస్త్రాసనము—దారిద్ర్యము.

రాతియందు—రోగోత్పత్తి.

భూమియందాసనము లేకుండిన—దుఃఖము.

కొయ్యయందు—నిష్ఫలము.

కృష్ణాజినమందు—జ్ఞానసిద్ధి.

వ్యాఘ్రచర్మమునందు—మోక్షము.

దర్భాసనమునందు—జ్ఞానప్రాప్తి.

కంబళీయందు—సర్వసిద్ధి గలుగును.

శ్లో॥ భూమ్యాంతదుఃఖసంభూతం దరిద్రం దారుకాశనమ్।
పాషాణేవ్యాధిసంభూతం మంత్రసిద్ధిఃకుశాసనే।
తృణాసనేయశోహానిః పల్లవేచిత్తవిభ్రమం।
రక్తకంబళవశ్యార్థం శ్వేతకంబళసంపద।
కృష్ణాజినేజ్ఞానకరే మోక్షశ్రీర్వ్యాఘ్రచర్మణి॥

భూమి - నేలను—దుఃఖము.

దారు - కఱ్ఱపీట—దరిద్రము.

పాషాణం - రాయి—వ్యాధి.

కుశాసనం - దర్భాసనమ్—మంత్రసిద్ధి.

తృణాసనం - గడ్డి ఆసనమ్—యశోహాని, కీర్తినష్టం.

పల్లవము - చిగురుటాకులు—చిత్తవిభ్రమం.

రక్తకంబళము—వశ్యం.

శ్వేతకంబళము—సంపద.

కృష్ణాజినం—జ్ఞానం.

వ్యాఘ్రచర్మము—మోక్షము.

శ్లో॥ పీతాసనం మోహనేస్యా ద్వ్యసితంచాభిచారికే।
జ్ఞేయాంశుక్లంచశాంత్యర్థం నశ్యేరక్తంప్రకీర్తితమ్॥

పచ్చని ఆసనము—జగత్తును మోహపరచును.

నల్లని ఆసనము—పగులకు హింసచేయుటకు.

తెల్లని ఆసనము—శాంతికొఱకు.

ఎఱ్ఱని ఆసనము—జనవశ్యము.

# జపదిశఫలములు.

శ్లో॥ ఆగ్నేయ్యాంకర్షణంచైవ వాయువ్యాంశత్రునాశనమ్।
నైరుత్యాందర్శనంచైవ ఈశాన్యాంజ్ఞానమేవచ॥

శ్లో॥ ఉదఙ్ముఖశ్శాంతిజాప్యే వశ్యేపూర్వముఖస్తదా।
యామ్యేతంమారణంప్రోక్తం పశ్చిమేచధనాగమః॥

శ్లో॥ మోహనంసర్వభూతానాం బంధమోక్షకరంపరం।
దేవరాజప్రియకరం రాజానంవశమానయేత్॥

ఆగ్నేయముఖముగా జపించిన—శత్రువునకు బాధ.

వాయువ్యముఖముగా—శత్రునాశము.

నైరుతిముఖముగా—మంత్రదేవతాదర్శనము.

ఈశాన్యముఖముగా—పరబ్రహ్మజ్ఞానము.

ఉత్తరముఖముగా—శాంతము.

తూర్పుముఖముగా—జనవశ్యము.

దక్షిణముఖముగా—శత్రుమారణము.

పశ్చిమముఖముగా—ధనాగమము గలుగును.

# జపస్థానఫలములు.

శ్లో॥ అథకామ్యజపస్థానం కథయామివరాననే।
సాగరాంతేసరిత్తీరే తీర్థేహరిహరాలయే॥

శ్లో॥ శక్తిదేవాలయేగోష్ఠే సర్వదేవాలయేశుభే।
వటస్యధాత్ర్యామూలేవా మఠేబృందావనేతథా॥

శ్లో॥ పవిత్రేనిర్మలేదేశే జపానుష్ఠానతోపివా।
నిర్వేదనేనమానేన జపం స్తోత్రంసమారంభేత్॥

తా. సముద్రసమీపమందును, నదీతీరమందును, పుణ్యభూమియందును, కేవలాత్మస్వరూపుడైన సద్గురునియాలయమందును, చైతన్యస్వరూపులైన పెద్దలయొక్క గృహములయందును, ఆరూఢజ్ఞానులు వసియించెడు శుభములగు సన్మస్తయిండ్లయందును, మఱ్ఱిచెట్టుయొక్కయు, యుసిరిక చెట్టుయొక్కయు, మొదటను యుపులమఠమునందును, బృందావనము నందును, నిర్మలమైన పవిత్రప్రదేశములయందును, జపమును, స్తోత్రమును జేయవలయును.

శ్లో॥ జాప్యేనజయమాప్నోతి జపసిద్ధిఫలంతదా।
హీనంకర్మత్యజేత్సర్వం గర్హితస్థానమేవచ॥

తా. జను డీపూర్వము జెప్పినస్థానములయందు జపముజేయుటచేత జయమును, జపసిద్ధివల్లనైన ఫలమును బొందుచున్నాడు. నీచకకర్మములను నింద్యస్థానములను విడిచిపెట్టవలయును.

శ్లో॥ స్మశానభయభూమానా వటమూలేచకాననే।
సిధ్యంతికానకేమూలే చూతవృక్షస్యసన్నిధౌ॥

తా. స్మశానమునందలి భయంకరమైన ప్రదేశమునందును, వటవృక్షము యొక్క మొదటియందును, అడవియందును, జయపాలవృక్షము యొక్క మొదటియందును, మామిడిచెట్టు సమీపమునందును జపించుట వలన సమస్తకార్యములు సిద్ధించుచున్నవి.

# జపఃకాలనిర్ణయము.

శ్లో॥ పంచపంచవృషఃకాల సప్తపంచఅరుణోదయః।
అష్టపంచభవేత్ప్రాతః శేషంసూర్యోదయఃస్మృతః॥

తా. సూర్యోదయము మొదలుకొని 55 ఘడియలుతర్వాతను వృషఃకాలమున అనగా స్నానసంధ్యావందనం చేసేసమయం. 57 ఘడియల తర్వాతను అరుణోదయకాల మనగా సూర్యబింబోదయకాలము. 58 ఘడియలతర్వాతను ప్రాతఃకాలము సూర్యదర్శనకాలము. 58 ఘడియలతర్వాతను 60 ఘడియలు మధ్యకాలము సూర్యనమస్కారములు జేయవలసినకాలము. తెల్లవారుజామున 4 గంటలవేళ వృషఃకాలము. 4 గం. 48 నిమిషములకు అరుణోదయకాలము. 4 గం. 12 నిమిషములకు ప్రాతఃకాలము. 4 గం. 12 నిమిషములు 6 గం. లకు మధ్యకాలము సూర్యోదయకాలము.

# జపవిధిః.

సమీపంబునందుండెడి జనులకు వినుటీతిని జేయుజపంబు—కనిష్టము.
తనశ్రోత్రములకు వినులాగున చేయుజపంబు—మధ్యమము.
ఇష్టదేవతయందు పవనమనోవృత్తులు లయింపజేసి యొనర్చుజపము—ఉత్తమం.

# నవగ్రహములు.

రవి, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని, రాహువు, కేతువు.

---

# నవగ్రహశాంతి.

ఆదివారము—గోధుమపిండి, నెయ్యితో భోజనము.

సోమవారము—పెరుగు, పరమాన్నముతో భోజనము.

మంగళవారము—కందిపప్పుతో భోజనము.

బుధవారము—పెసరపప్పుతోను, నల్ల ఉలవపప్పుతోను భోజనము.

గురువారము—కొమ్ము సెనగపప్పుతో, మినపప్పుతో భోజనము.

శుక్రవారము—బొబ్బర్లపప్పుతో భోజనము.

శనివారము—చేనువ్వులు వేసిన కూరతో భోజనము.

ఈప్రకారముగా సాధు, లేక మహేశ్వరుడు లేక బీదవానికి భోజనము పెట్టి తాంబూలము దక్షిణ సమర్పించేది.

---

# స్వప్నశుభాశుభ ఫలములు.



సర్వేంద్రియములు వానివాని వ్యాపారములను చాలించియుండగా ఎప్పుడు మనస్సుగూడ సర్వవ్యాపారమును జాలించి సుషుప్తిం జెందియుండునో అప్పుడు పదార్థములవలన నానావిధమగు స్వప్నమును గాంచుచున్నాడు. ఆ. స్వప్నము ఇష్టఫలము అనిష్టఫల మని రెండువిధములు.

నదులను సముద్రమును దాటుట, ఆకాశమునందు బోవుట, సూర్యోదయము మందుచున్న నిప్పు నవగ్రహములు, నక్షత్రములు, చంద్రమండలము వీనిని గాంచుట. మేడలు, రాజగృహములు, దేవతాగృహములు వీనిపై నెక్కుట. ఇవి మొదలగు వానిని స్వప్నమును గాంచిన నరుడు కార్యసిద్ధిని బొందును. కల్లుద్రాగుట, వస, మాంసము వీనిని దినుట. పురుగులు, పురీషము వీనిని శరీరమునందు పూసికొనుట. రక్తస్నానము పెరుగన్నమును తినుట, తెల్లనివస్త్రములు ధరించుట, తెల్లనిచందనాది మైపూతలు, రత్నములు, ఆభరణాదులు నివియు స్వప్నమందు గలిగిన కార్యసిద్ధికరములు. దేవతలు, విప్రులు, ద్విజాలు, గొడుగు, పొట్టు, పద్మములు, రాజులు, తెల్లని పూలను, వస్త్రములను, మంచియాభరణములను ధరించిన స్త్రీ, ఎద్దు, కొండ, పాలు, ఫలవంతమగువృక్షము నెక్కుట. అద్దము, మాంసము, పూలమాలికలు వీనిని పొందుట. గొప్పయేళ్లు, చెరువులు, నదులు వీనిని దాటుట. ఇవి స్వప్నమందు గలిగిన ధనలాభమగును. రోగవిముక్తియు నగును. స్వప్నమున రాజు, ఏనుగు, గుఱ్ఱము, బంగారు, ఎద్దు, ఆవు వీనిని జూచిన వానియొక్క కుటుంబము వృద్ధియగును. ఆవు, యెద్దు, ఏనుగు, దేవరాజగృహములు. కొండకొనవృక్షములు వీనిపై నెక్కుట, మలమును పూసికొనుట, యేడ్చుట, చచ్చుట, పొందగూడని స్త్రీని పొందుట. ఇవి స్వప్నమును గలిగిన మంచిది. పాలు గలిగి పండియున్న వృక్షమును ఒంటరిగా నెక్కి యచ్చటనుండి యే మేలుకొనిన శీఘ్రముగ ధనలాభమగును. తెల్లనిసర్పముచే కుడిచేయి కరవబడిన పదిదినములలోపల సహస్రలాభము గలుగును. పాముగాని తేలుగాని నీటియందు గరచినస్వప్నమున విజయము, అర్థసిద్ధిపుత్రులు గలుగుదురు. దేవతారాజగృహములు

కొండలు వీనిపై నెక్కి సముద్రమును దాటినయెడల నీచకులమునందు బుట్టినవాడయి నను నిశ్చయముగ రాజగును. చెరువునదము నేయిపాయసము వీనిని గొప్పతామ రాకునందు భుజించిన భూపతియగును. తెల్ల కొక్కరపక్షి, ఆడుకోడి, ఆడకొంగ, వీనిని జూచి మేల్కొనినయెడల స్వకులమున బుట్టినదియు ప్రియముగ మాట్లాడునదియు నగు మరియొక భార్యను పొందును. గొలుసులతో బంధింపబడినట్లును బాహువులు త్రాటిచే గట్టబడినట్లును స్వప్నమైనయెడల పుత్రుడు కలుగును. లేక శీఘ్రముగ ధనమైనను వచ్చును. తన ఆసనము, పాన్పు, వాహనము, శరీరము, గృహము ఇవి మండుచుండగా నప్పుడే మేల్కొనినయెడల వానికి గొప్ప సంపద గలుగును. చంద్ర సూర్యమండలములు గాంచిన రోగిరోగవిముక్తుడగును. రోగము లేనివాడు సంపద నొందును. నెత్తురునుగాని కల్లునుగాని బ్రాహ్మణుండు త్రాగిన విద్యను పొందును. ఇతరుడైనయెడల ధనమును పొందును. తెల్లనివస్త్రముల ధరించి తెల్లనిచందనాదులను పూసికొనిన స్త్రీ తనను కౌగిలించినయెడల సంపద కలుగును. పావుకోళ్లు, పాది రక్షలు, గొడుగు ఇవి లభించినట్లు స్వప్నంబై వెంటనే మేల్కొనినను మంచిపదును గల నిర్మలమైన కత్తి దొరకినట్లయినను మంచిభోజనము గలుగును. ఆవు, ఎద్దులు వీనిని కట్టిన రథమును ఒంటరిగ నెక్కినట్లయిన వెంటనే మేల్కొనిన శీఘ్రముగ ధనమును పొందును. పెరుగు దొరకిన అర్థలాభము. నేయి దొరకిన మంచికీర్తి కలుగును. నేతిని తినిన కష్టము కలుగును. పెరుగు తినిన కీర్తి కలుగును. తాను గృహమునందు నిప్పులో తగులుకొన్నట్టయిన మండలాధిపత్యముగల రాజగును. పట్టణమందు నిప్పులో తగులు కొన్నట్లయిన పృథివీపతియగును. పక్వమైన మనుష్యుని పాదములమాంసమును తినిన ట్లయిన నూరులాభమగును. బాహువుల భక్షించినట్లయిన సహస్రలాభము గలుగును. తలను భక్షించినట్లయిన రాజ్యముగాని నూరువేలుగాని లాభము గలుగును. ప్రత్తి, భస్మము, అన్నము, మజ్జిగ. ఇవి తప్ప తక్కిన తెల్లనివస్తువులన్నియు శుభప్రదములు. ఆవు, ఏనుగు, దేవతలు, ద్విజులు, గుఱ్ఱములు. ఇవి తప్ప తక్కిన నల్లనివస్తువులన్నియు అతి నిందితములు. పితికినప్పుడు నురుగుతో గూడియుండుపాలును త్రాగినట్లయిన యజ్ఞమునందు సోమపానము చేయువాడును, అనేకభోగము లనుభవించువాడగును. పెరుగును చూచిన సంతోషము గలుగును. గోధుమలను చూచిన ధనప్రాప్తియగును. యవధాన్యమును జూచిన యజ్ఞప్రాప్తియగును. ఆవాలను జూచిన లాభము గలుగును. తమలపాకు, కర్పూరము, అగరుచందనము, తెల్లనిపుష్పము వీనిని పొందిన నఖండ సంపద గలుగును.

స్వప్నమున గంగరావి, మోక్కగు, పారిజాతము, ఈ చెట్లమీదను, పుట్టమీది చెట్టుమీదను ఎక్కుట. నూనె, ప్రత్తి, రాయోకపవృక్షము, ఇనుము వీనిని పొందుట ఆపదను గలిగించును. విహరించుట, రక్తవస్త్రమును ధరించుట, ప్రవాహములు హరించినట్లగుపడుట, పక్వమాంసభోజనము సూర్యచంద్రుల నున్నట్లుండి కాంతిహీనులనుగా జూచుట, నక్షత్రములు క్రిందపడుచున్నట్లు కనబడుట, పుష్పించిన అశోకము, గన్నేరు, మోదుగు వీనిని జూచుట, వీనివలన శోకమును పొందును. ఓడ నెక్కి నదులను దాటినట్లయిన ప్రయాణము గలిగి శీఘ్రముగ పునరాగమము గలుగును. ఎఱ్ఱనివస్త్రము ధరించి యెఱ్ఱనిచందనమును పూసికొనిన స్త్రీ తనను కౌగిలించినట్లయిన మృత్యువు కలుగును. నూనె, పాలు, నేయి వీనిచేతగాని ఇతరములయిన చమురులచేతనుగాని శరీరము పూసికొన్నట్లయిన వ్యాధి కలుగును. వెండ్రుకలు రాలుట, దంతము లూడిపడుట వీనివలన ద్రవ్యనాశముగాని పుత్రనాశముగాని కలుగును. గాడిదెలు, ఒంటెలు, దున్నపోతులు వీనిని గట్టిన రథమును ఒంటరిగా నెక్కినట్లయిన యచ్చోటనుండి మేల్కొనిన మృత్యువు గలుగును. చెవులు, ముక్కు, చేతులు మొదలగు అంగములు ఛేదింపబడినట్లును, బురదలో దిగినట్లును, గాడిద, ఒంటె, దున్నపోతు వీనిపై నెక్కిపోయినట్లును తల యంటికొనినట్లును స్వప్నమైన మృత్యువు గలుగును.

రోగమువలనగాని ధాతువికారమువలనగాని పగటియందుగాని గలిగిన స్వప్నమునకు ఫలము లేదు. స్వప్నములు మొదటిజామునం దైనయెడల సంవత్సరమునకును రెండవజామునం దైనయెడల 8 మాసములకు మూడవజాము నైనయెడల 9 నెలలకును నాలవజామునం దైనయెడల ఒకమాసమునకును ఫలము నిచ్చును. అరుణోదయకాలమం దైనయెడల 10 దినములలో ఫలమగును. ఆవుదూడను విడుచువేళ యయినయెడల నప్పుడే ఫలమగును. ఇది సుస్వప్ననిర్ణయము. దుస్స్వప్నము లైనయెడల పై జెప్పిన కాలమునకు సగముకాలములో నగును. సుస్వప్నము కలిగినయెడల తిరిగి నిద్రించకూడదు. దుస్స్వప్నములయినయెడల దానిశాంతికొరకు శుద్ధుడై యెవ్వరితోను చెప్పక తిరిగి నిద్రించవలయును. సుస్వప్నమును ప్రొద్దున లేచి బ్రాహ్మణోత్తముల కెరిగించి వారివలన నాశీర్వాదమే గొనవలయు. రాత్రియందు జెప్పగూడదు.

---

# శుభాశుభ శకునలక్షణములు.

ప్రయాణాదులయందు నల్లనిధాన్యము, ప్రత్తి, ఎండుగడ్డి, కట్టెలు, ఘనము, కొరివికట్టె, బెల్లము, నూనె, బోడితలకు నూనె యంటుకొన్న మనిషి, దిగంబరుడు, ఇనుము, బురద, చర్మము, వెండ్రుకలు, పిచ్చివాడు, నపుంసకుడు, చండాలుడు, మొదలగువారు, కారాగృహ పాలకులు. గర్భిణీస్త్రీ, రండ, గానుగపిండి, చావు, పొట్టుభస్మము, తలపుకట్టె, యెముక, పగిలినకుండలు ఇవి యెదురుగ వచ్చిన అపశకునములు. మరియు పోవునపుడు పిలుచుట గూడదు. పొమ్మని చెప్పుట మంచిది. ఎవడైనను ముందుండి మరలిపొమ్మని చెప్పుట, ఎక్కడికి బోవుదు ఉండు ఇప్పుడు పోవలదు, ఎందుకు బోవుచున్నావు అని యడుగుట ఇవి కార్యనాశకరములును స్వమృత్యు హేతువులును అగును. బండి పడుట, చేతిలోని ఆయుధములు క్రిందపడుట, పోవునపుడు ద్వారబంధమువలన నెత్తిమీద దెబ్బతగులుట, గొడుగుపై వస్త్రము క్రిందబడుట ఇట్టి యపశకునములు గలిగిన మరలివచ్చి శ్రీహరిపూజ గావించి ధ్యానించి కొంతసేపు తాళి బయలువెడలవలయు. రెండవమారును అపశకునం బయినయెడల మరలి యింటికి బోవలయును. తెల్లనిపుష్పములు శ్రేష్ఠములు. జలపూర్ణభాండములు మరీ ఉత్తమము. మాంసము మత్స్యములు దూరముగా ధ్వనిని వినుట. ముసలివాడు, మేక, ఆవులు, గుఱ్ఱములు, ఏనుగులు, దేవతలు, మండుచున్ననిప్పు, గరిక, ఆవుపేడ, భోగముది, బంగారు, వెండి, రత్నములు, పెండ్లికానిపడుచు, ముత్తయిదువ, పేలాలు, ఇద్దరు బ్రాహ్మణులు, వస, ఆవాలు, మూలికలు, పెసలు, ఆయుధములు, కత్తి, గొడుగు, పీటలు, రాజచిహ్నములు, కూడయేడ్చువారు లేనిపీనుగు, పండ్లు, నెయ్యి, పెరుగు, పాలు, అక్షతలు, అద్దము, తేనె, శంఖము, చెరుకు, శుభవాక్యములు, భక్తులు, వాయించెడి చతుర్విధఘోషము, ఉరుములు, మెరుపు, మనస్సంతుష్టి ఇవి మంచిశకునములు.

పోవునపుడు పిల్లి అడ్డముగ పోయిన కార్యహానియగును. పిల్లులు ఎదురుగ పోట్లాడిన కలహమగును. ఎలుకను నోట గరిచికొని ఎదురుగ వచ్చిన తనకు జయమగును. శత్రువులకు అపజయము వగును. తాను చేయుకార్యమునకు నడుమ పిల్లి పోయిన కార్యనాశమగును. ముఖము తుడుచుకొనుచుండిన బంధువులు వత్తురు.

మనిషి ప్రయాణమై పోవునపుడు కాకి అనుకూలమైనయెడల క్షేమము. కార్యసాఫల్యము నగును. ప్రతికూలమైనయెడల భయావహమును కార్యనాశము నగును. అరచుచు నెదురుగ వచ్చిన ప్రయాణమునందు దెబ్బతగులును. కాకి ఎడమ నుండి కుడికి పోయిన తీర్చుట ఇది మంచిది. కుడినుండి ఎడమకు పోయిన కట్టుట ఇది అశుభప్రదము. ఎడమనుండి కుడి పోవునప్పుడు పైనుండి క్రిందుగ వచ్చిన అనులోమము. ఇది మిక్కిలి మంచిది. కుడినుండి అనులోమముగ వచ్చిన మధ్యమము. ఎడమనుండి ప్రతిలోమముగ వచ్చిన ప్రయాణమునకు భంగము గలుగును. అమేధ్యమును ముక్కున గరచికొని ఎదురుగ వచ్చిన కార్యమగును. ద్వారమునందు పోవుచు వచ్చుచుండిన దేశాంతరము పోయినవారు వత్తురు. ఎట్టినది కాలినది యైనవస్తువును యింటిలో బడవైచిన అగ్నిభయము గలుగును. నెత్తురును ఎదుట పడవైచిన కారాగృహప్రాప్తియగును. పచ్చనిద్రవ్యము బంగారు వెండి వీనిని తెచ్చి పడవేసిన లాభము గలుగును. ఈ వస్తువుల నెత్తుకొనిపోయిన హాని గలుగును. పచ్చిమాంసమును ఎదుట గ్రక్కినయెడల ధనలాభమగును. మున్నునుంచినయెడల భూమిలాభము గలుగును. రత్నములను పడవైచిన గొప్పరాజ్యము గలుగును.

కుక్క ఇంటిలోనికి వచ్చి మొరిగిన ఇంటివానికి మరణము గలుగును. తన యెడమశరీరమును నాకిన ధనలాభము గలుగును. కుడిభాగమును ఎడమభుజమును నాకిన భయము కలుగును. పోవువానికి యెదురుగ వచ్చిన యాత్రయందు దెబ్బతగులును. మార్గము నడ్డగించిన త్రోవలో దొంగలబాధ కలుగును. ఎముకలను త్రొళ్లను గుడ్డలను నోట గరచికొని వచ్చిన లాభహీనమగును. చెప్పులు మాంసము నోట గరచికొని వచ్చిన మంచిది.

నక్క మొదలగువాని శకునంబులను కుక్కలవలెనే ఫలము తెలిసికొనవలయును.

---

# మరణచిహ్నములు.

ఎవనికి నాలుక నల్లగ ముఖము కుంకుమవలె యెఱ్ఱగ నుండునో వానికి నొక సంవత్సరములోపల మరణము గలుగును. చెట్లు మొదలునందును బొమ్మయందును నిప్పుతునుకలు రాలుచున్నట్లు గన్పట్టిన నారు నెలలు బ్రతుకును. రేతస్సు, మలము, మూత్రము నురుగుతో గూడిన మలము ఇవి యొకానొకప్పుడు స్వభావవిరుద్ధముగను అనేకవిధములుగను గనుపడినను అన్నమును భుజించిన వెంటనే ఆకలి పుట్టినను ఒక సంవత్సరములోపల నిశ్చయముగ మృతిబొందును. ఆకసంబున నింద్రనీలసదృశంబులైన సర్పంబులగుంపు సంచరించుచుండినట్లు గనపడిన నాలు నెలలు జీవించును. ఎల్లప్పుడు ఉదరముబ్బియుండుటయు అహోరాత్రములు నీరుత్రాగుటయుం దప్పి గలిగియుండిన 4 లేక 5 లేక 6 నెలలు జీవించియుండును. నలుపు, పసుపు మొదలగు వర్ణములను కారము, పులుసు, ఉప్పు గల ద్రవ్యములను అకస్మాత్తుగ వ్యత్యయముగ నెరింగినను 6 నెలలలోపల మృతిబొందును. తన ముఖప్రతిబింబముగాని, శిరముగాని, వాననీటి యందును, అద్దమునందును, గనుపడకుండినను నాల్గునెలలో మృతిగలుగును. శక్తి యుడిగినట్లుండుటయు, ఎప్పుడును కోపముతో మాట్లాడుటయు, కార్యములయందు ప్రయత్నములేకుండుటయు గలిగియుండిన నాలు నెలలకు మరణము కలుగును. ఐశ్వర్యముతో గూడియుండినప్పుడు చీకటిలో స్త్రీసంభోగము చేయుటయుం దిష్టము గలిగిన నైదుమాసములు జీవించును. మలము కాకవిష్టమువలెను, ధూళివర్ణమువలెను గనుపడినను తననీడ వేరువిధములు గనుపడినను అయిదు నెలలలోపల మృతిబొందును. మేఘము లేనపుడు మెరుపును దక్షిణపుదిక్కున నింద్రధనస్సును గనపడిన మూడు నెలలు బ్రతుకును. శరీరమునందు కాంతిలేనివాడుగను కామరహితుడుగను రుచితెలియనివాడుగ నుండిన మూడు నెలలకుమీద మృతినొందును. దేహము అకస్మాత్తుగ స్థూలంబైనను కృశించినను ఒక నెలలోపల మరణము గలుగును. నూనె, నేయి, అద్దము, నీళ్లు వీనియందు తనదేహము వానరదేహమువలె గనబడినను శిరములేనట్లు గనపడినట్లు గనుపడినను ఒక నెలమీద బ్రతుకడు. హఠాత్తుగ దేహమునందు శక్తిలేకుండుట, పాండువర్ణము, మిక్కిలి నిశ్వాసము వచ్చుట, నిత్యము మలము పలుమారు వెడలుట ఇవి గలిగినయెడల

నొకమాసము జీవించును. నడిరేయియందు ఇంద్రధనస్సును పగలు చంద్రగ్రహణంబును గనుపడిన ఆయుఃక్షీణము కలుగునని తెలియవలయును. ముక్కు వంకరదై చెవులు పొడవుగనై కన్నులయందు నీరు ప్రసరింపుచు కన్ను లున్నతములై ముఖ మెఱ్ఱగను నాలుక లోపలి కీడ్చుకొని యుండిన నొకమాసములో మరణము గలుగునని తెల్వియవలయు. దీపమారినప్పుడు వాసన తెలియకుండినను మిత్రులమాటలయందు నూయ గలిగినను అరుంధతీనక్షత్రము గనుపడకుండినను వాసన తెలియకుండినను ధ్వని వినరాకుండినను ఆయుఃక్షీణము తెలియవలయు. సూర్యోదయమగునప్పుడు నక్కలగచుచు నెదురుగ పరిగెత్తివచ్చినను మలము విపరీతముగ వెడలినను సద్యోమృతి గలుగునని తెలియవలయు.

సీ. జలమానుసూర్యప్రసాదబింబముగన
    నిండైనయారోగ్యముండుతనువు
పూర్వాదినలుదిశల్ ఫృగ్నంబుగాకున్న
    నాగుమూడైరెండునొకల నెలను
కన్నులుబడుగీతగాబింబముండిన
    పదదినంబులమృతిప్రాప్తుడగును
ధూమాకృతిన్ గనులబోపినయెడపదినము
    మంటగానగదినమందెపోవు
ద్రుపుడనేముక్కు చివరయుదోపకున్న
    నటులనుంధతినాలుకయూసకున్న
చంద్రబింబముచౌకమైసాగుచున్న
    నారునెలలకు యమలోకమంటియుండు

క. మామోలు లేనినాసము
    యేమేలును చేయరాదు మెచ్చునతగ్గున్
యీమానవులకుగలిగిన
    భామామణివినుముతనువుభంగంబుసుమా.

# పురుషసాముద్రికము.

పురుషుడు ధర్మార్థకామంబులతో గూడిన ముఖ్యమగు ధర్మము కలిగియుండ వలయు. కనుపాపలు తప్ప తెల్లగ్రుడ్డునందును దంతములయందును ధావళ్యము గలిగి యుండవలయు. చెవులు నాభి వీనియందు లోతు గంభీరస్వరము గలిగియుండవలయు.

ఈర్ష్యలేకుండుట, దయ, ఓర్పు, మంగళాచారయుక్తత, ఆచారముకోరక, అకార్పణ్యము, శ్రమను లేనిశౌర్యము ఇవి గలిగియుండవలయు. కనుబొమలు భుజములు నిడుదలై యుండవలయు. దిక్కులయందు పరాక్రమముచేతను, దేశములయందు కీర్తిచేతను, జాతియందు సంపత్తుచేతను, వ్యాపించియుండవలయు. ఉదరమునందును కంఠమునందును అడ్డముగ నిడుదలైన మూడు మడతలు గలిగియుండవలయు. దేవబ్రాహ్మణగురువులకు నమ్రుడై యుండవలయు. ధర్మార్థకామములకాలము నెరిగి యుండవలయు. కనుగొనలు, గోళ్లు, అరకాళ్లు, అరచేతులు ఇవి యెఱ్ఱగ నుండవలయు. పాదరేఖలు, వెండ్రుకలు ఇవి నున్నగ మెరుగుగ నుండవలయు. రొమ్ము నుదురుముఖము విశాలముగ నుండవలయు. అరచేతులు, అరకాళ్లు, ధ్వజచ్ఛత్రాది లాంఛనములతో గూడియుండవలయు. మఱియు లలాటము, పాదములు, చేతులు వీనియందు నాలుగేసి రేఖ లుండవలయు. వ్రేళ్లు, హృదయము, వీపు కటిప్రదేశము ఇవి సమముగ నుండవలయు. మరియు భుజములు, మోకాళ్లు, తొడలు, పిక్కలును సమముగ నుండవలయు. దేహప్రమాణము 96 అంగుళముల పొడవు గలిగియుండవలయు. నాలుగు కోరపండ్లు చంద్రప్రకాశము గలిగియుండవలయు. మీసములు, కనుపాపలు, కనుబొమలు, వెండ్రుకలు ఇవి నల్లగ నుండవలయు. ముక్కు, నోరు, దేహము, చంకలు, వీనియందు దుర్గంధములేకుండ నుండవలయు. మెడ, పిక్కలు ఇవి పొట్టిగ నుండవలయు. వ్రేలిగణుపులు, గోళ్లు, వెండ్రుకలు, పండ్లు, చర్మము ఇవి సూక్ష్మములుగ దౌడలు, నేత్రములు, ముక్కు, రొమ్ము ఇవి దీర్ఘములుగ నుండవలయు. రొమ్ము, చంక, ముక్కు, పొట్ట, భుజ, శిరములు, ముఖము, (ముచ్చిలిగుంట) ఇవి ఉన్నతములుగ నుండవలయు. వీపుయెముక, శరీరము, కాలివ్రేళ్లు, చేతివ్రేళ్లు, బాహువులు, ముక్కు, నేత్రములు, చెవులు ఇవి పొడవుగ నుండవలయు. చర్మము, వెండ్రుకలు, దంతములు, రోమములు, నేత్రములు, గోళ్లు, వాక్కు ఇవి మెరుగు

గలిగి సన్నగ నుండవలయు. కన్నులు, ముక్కు, పుటములు, చెవులు, గుదము, ముఖము వీనియందు మలములేకుండ నుండవలయు. నాలుక, పెదవులు, దౌడలు, కన్నులు, హస్తములు, పాదములు, అరచేతులు, అరకాళ్లు ఇవి పద్మాకారము గలిగి యుండవలయు. హస్తములు, పాదములు, మెడచెవులు, రొమ్ము, శిరస్సు, లలాటము, ఉదరము, వీపు ఇవి విశాలములై యుండవలయు. భుజములు చాచినపుడు భుజము యొక్క నడిమిభాగము (అనగా మోచేయి) కొనభాగము మొదటిభాగము ఇవి ఉన్నతమై సమముగ నుండవలయు. పాదములు, చీలమండలు, పిరుదులు, ప్రక్కలు, గజ్జలు, స్తనములు, చెవులు, పెదవులు, తొడలు, పిక్కలు, చేతులు, బాహువులు, కన్నులు ఇవి హెచ్చుతక్కువలు లేక సమానముగ నుండవలయు. 14 విద్యలు రెండు కన్నులను గలపురుషుడు షోడశాత్ము డనబడును. శరీరము వేడిగను పైకి గనపడుచున్న నరములుగలది గనుక కండలేనిదిగను దుర్వాసనగలదిగ నుండిన మంచిదికాదు. దీనికి విపరీతముగ నుండునది శ్రేష్ఠమైనది. నిర్మలమైనదృష్టియు, మధురమైనవాక్కును, మదపుటేనుగినడకయు, రోమకూపములయం దొక్కొక్క రోమ ముండుటయు మహా పుణ్యవంతుని లక్షణములు.

---

# స్త్రీసాముద్రికము.

సుందరములగు సర్వాంగములును మదపుటేనుగు నడకవంటి నడకయు ఘనమైననితంబమును నల్లని వెండ్రుకలును మిక్కిలి లావులేక సన్నమై రోమరహితమయి మనోహరముగ నుండుశరీరమును సమభూమియందు నిలిచిన బాగుగ నడుగులు గన్పట్టునట్టిపాదంబులును ప్రదక్షిణమగు సుడిగల బొడ్డును, నడుమ పల్లముగల చీలమండలును, బొటనవ్రేలి ప్రమాణముగల నాభియు, వ్రేలాడని కడుపుయును, రోమములచే కప్పబడని శరీరమును గల స్త్రీ శుభకరురాలగును. నక్షత్రములు, వృక్షములు, నదులు వీనినామధేయములును ఎల్లప్పుడు కలహమునందాశయు, అత్యాశయు, దుర్భాషలును ఒకటితో నొకటి కలుసుకొనిన కనుబొమలునుగలది అశుభురాలగును. ఇప్పపువ్వునుబోలి నిగనిగలాడు చెక్కిళ్లను పైకి నరములు తెలియనిదేహమును పతియందత్యంతప్రేమయును భర్తను ప్రాణములతో సమానముగ చూచుకొనుటయుగలది శుభకరురాలు. పాదము నేల మోపినప్పుడు చిటికెనవ్రేలు పుడమిని తాకకుండిన అట్టి స్త్రీ మృత్యుదేవతయని తెలియవలయు.

# సంవత్సరములు 60.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్రభవ | ... | ... | 1 | నందన | ... | ... | 26 |
| విభవ | ... | ... | 2 | విజయ | ... | ... | 27 |
| శుక్ల | ... | ... | 3 | జయ | ... | ... | 28 |
| ప్రమోదూత | ... | ... | 4 | మన్మథ | ... | ... | 29 |
| ప్రజోత్పత్తి | ... | ... | 5 | దుర్ముఖి | ... | ... | 30 |
| ఆంగీరస | ... | ... | 6 | హేవిళంబి | ... | ... | 31 |
| శ్రీముఖ | ... | ... | 7 | విళంబి | ... | ... | 32 |
| భావ | ... | ... | 8 | వికారి | ... | ... | 33 |
| యువ | ... | ... | 9 | శార్వరి | ... | .. | 34 |
| ధాతు | ... | ... | 10 | ప్లవ | ... | ... | 35 |
| ఈశ్వర | ... | ... | 11 | శుభకృత్తు | ... | ... | 36 |
| బహుధాన్య | ... | ... | 12 | శోభకృత్తు | ... | ... | 37 |
| ప్రమాది | ... | ... | 13 | క్రోధి | ... | ... | 38 |
| విక్రమ | ... | ... | 14 | విశ్వావసు | ... | ... | 39 |
| విషు | ... | ... | 15 | పరాభవ | ... | ... | 40 |
| చిత్రభాను | ... | ... | 16 | ప్లవంగ | ... | ... | 41 |
| స్వభాను | ... | ... | 17 | కీలక | ... | ... | 42 |
| తారణ | ... | ... | 18 | సౌమ్య | ... | ... | 43 |
| పార్థివ | ... | ... | 19 | సాధారణ | ... | ... | 44 |
| వ్యయ | ... | ... | 20 | విరోధికృత్తు | ... | ... | 45 |
| సర్వజిత్తు | ... | ... | 21 | పరీధావి | ... | ... | 46 |
| సర్వధారి | ... | ... | 22 | ప్రమాదీచ | ... | ... | 47 |
| విరోధి | ... | ... | 23 | ఆనంద | ... | ... | 48 |
| వికృతి | ... | .. | 24 | రాక్షస | ... | ... | 49 |
| ఖర | ... | ... | 25 | నళ | ... | ... | 50 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| పింగళ | ... | 51 | దుందుభి | ... | 56 |
| కాళయుక్తి | ... | 52 | రుధిరోద్గారి | ... | 57 |
| సిద్ధార్థి | ... | 53 | రక్తాక్షి | ... | 58 |
| రౌద్రి | ... | 54 | క్రోధన | ... | 59 |
| దుర్మతి | ... | 55 | అక్షయ | ... | 60 |

# అయనములు 2.

1. ఉత్తరాయణము :—పుష్యమాసమందు మకరసంక్రాంతి ప్రవేశదినము మొదలుకొని ఆషాఢమాసమందు కర్కాటకసంక్రమణంప్రవేశదినముయొక్క వెనుకటి దినమువరకు ఆరుమాసములు.

2. దక్షిణాయనము :—కర్కాటకసంక్రాంతి మొదలుకొని మకరసంక్రాంతి వెనుకటిదినమువరకు ఆరుమాసములు.

# ఋతువులు 6.

1. వసంతఋతువు— { చైత్రము. వైశాఖము.
2. గ్రీష్మఋతువు— { జ్యేష్ఠము. ఆషాఢము.
3. వర్షఋతువు— { శ్రావణము. భాద్రపదము.
4. శరదృతువు— { ఆశ్వయుజము. కార్తికము.
5. హేమంతఋతువు— { మార్గశిరము. పుష్యము.
6. శిశిరఋతువు— { మాఘము.

## మాసములు 12.

| | | | | | |
|---|---|---|---|---|---|
| చైత్రము | ... | 1 | ఆశ్వయుజము | ... | 7 |
| వైశాఖము | ... | 2 | కార్తికము | ... | 8 |
| జ్యేష్ఠము | ... | 3 | మార్గశిరము | ... | 9 |
| ఆషాఢము | ... | 4 | పుష్యము | ... | 10 |
| శ్రావణము | ... | 5 | మాఘము | ... | 11 |
| భాద్రపదము | ... | 6 | ఫాల్గుణము | ... | 12 |

## పక్షములు 2.

1 శుక్లపక్షము :—అమావాస్య వెళ్లిన పాడ్యమీ మొదలు పౌర్ణమీవరకు 15 దినములు.

2. కృష్ణపక్షము :—పౌర్ణమీ వెళ్లిన పాడ్యమీ మొదలు అమావాస్యవరకు 15 దినములు.

## వారములు 7.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | ... | 1 | గురువారము | ... | 5 |
| సోమవారము | ... | 2 | శుక్రవారము | ... | 6 |
| మంగళవారము | ... | 3 | శనివారము | ... | 7 |
| బుధవారము | ... | 4 | | | |

## నక్షత్రములు 27.

| | | | | | |
|---|---|---|---|---|---|
| అశ్వని | ... | 1 | కృత్తిక | ... | 8 |
| భరణి | ... | 2 | రోహిణి | ... | 4 |

| | | | |
|---|---|---|---|
| మృగశిర | 5 | అనూరాధ | 17 |
| ఆరుద్ర | 6 | జ్యేష్ఠ | 18 |
| పునర్వసు | 7 | మూల | 19 |
| పుష్యమి | 8 | పూర్వాషాఢ | 20 |
| ఆశ్లేష | 9 | ఉత్తరాషాఢ | 21 |
| మఖ | 10 | శ్రవణము | 22 |
| పుబ్బ | 11 | ధనిష్ట | 23 |
| ఉత్తర | 12 | శతభిషం | 24 |
| హస్త | 13 | పూర్వాభాద్ర | 25 |
| చిత్త | 14 | ఉత్తరాభాద్ర | 26 |
| స్వాతి | 15 | రేవతి | 27 |
| విశాఖ | 16 | | |

## రాసులు 12.

| | | | |
|---|---|---|---|
| మేషము | 1 | తుల | 7 |
| వృషభము | 2 | వృశ్చికము | 8 |
| మిధునము | 3 | ధనస్సు | 9 |
| కర్కటము | 4 | మకరము | 10 |
| సింహము | 5 | కుంభము | 11 |
| కన్య | 6 | మీనము | 12 |

# ఔషధములు.

## 1. రాతిరిబేదిమాత్ర.

ద్రాక్షపండు, ఖర్జూరపుపండు, సునాముఖి, పటికపంచదార, వస్తువ ఒక్కటింటికి పావుతులముచొప్పున కొద్దిగా మంచినీళ్లతో ముద్దగా నూరి రెండుమాత్రలు జేసి రాత్రి భోజనం తరువాతను రెండుమాత్రలు పుచ్చుకొనేది. విరోచనకారి, ఆమనివర్త.

## 2. రాతిరిబేదిమాత్ర.

రూమిమస్తకిపొడుము గిగి 1. తెల్లచక్కెర గిగి 2½. ఈ రెంటిని నూరి ఒక్క ఉండగా జేసి పెట్టుకొని పండబోవునప్పుడు పుచ్చుకొని వెంబడిని కొంచెము చన్నీళ్లు పుచ్చుకొని నిద్రింపగా మరునాడు వేకువను లెస్సగా బేదియగును. ఇది అన్నాశయమునకు మిక్కిలిగా మంచిజేయును.

## 3 త్రిదోషహారీ.

శొంఠి 3 తులములు, మిరియాలు 3 తులములు, ధనియాలు అర్థశేరు. ఈ మూడువస్తువులు చెత్తలేకుండా బాగుచేసి దంచి యుంచుకొని మూడువేళ్లతో వచ్చినంత చూర్ణము అర్థశేరు మంచినీళ్లలో వేసి అర్థపావుకు మరిగించి వడియగట్టి ఉదయం పరగడుపున పుచ్చుకొనేది. ఇందువల్ల వాతపైత్యశ్లేష్మములు హరించును.

## 4. ద్రాక్ష లేహ్యము.

ద్రాక్షపళ్లు, పంచదార, తేనె ఇవి సమభాగములు కలిపి పుచ్చుకొనిన సమస్త అజీర్ణములు హరించును.

## 5 మహాగ్నిముఖచూర్ణము.

చిత్రమూలము, అత్తివస, కోష్టు, ఇంగువ, సౌవర్చలవణము, వస, పిప్పళ్లు, కాయఫలచెక్క, గంటుభారంగి, ఓమము, శొంఠి, యవాక్షారము, విళంగములు, మిరియాలు, పిప్పిలిదుంప ఇవి సమభాగములు. ఈ యన్నిటికి సమము కరక్కాయలు చూర్ణముజేసి మాడెత్తుచొప్పున శొంఠిరసముతోగాని, కషాయముతోగాని, వేడి

నీళ్లతోగాని, గంజితోగాని, చిట్టుడుకునీళ్లతోగాని, ప్రాతఃకాలమున బుచ్చుకొనిన అజీర్ణము, అనాహము, ఉదావర్తి, కుండలి, మూలవ్యాధి, గ్రహణిదోషము, ఆధ్మానము, హిక్క, శ్వాస, ఖాస, పాండురోగము, హృదయము, నేత్రములు, కడుపు వీటియందు పుట్టిన మహాదోషములు. నాభిశూల, కుక్షిశూల ఇవి మానును. మరియు మిక్కిలి జఠరదీప్తి గలుగును. గురుత్వపదార్థములు, చమురు గలిగినపదార్థములు, కొవ్వుగలపదార్థములు, అపరిశుద్ధపదార్థములు వీటిని విశేషముగ బుచ్చుకొనినప్పుడుగాని అనేకపదార్థములు ఏకకాలమందు పుచ్చుకొన సంభవించినప్పుడుగాని అమిత భోజనము చేయ తటస్థించినప్పుడుగాని ఈ చూర్ణము పైన చెప్పినవిధమున పుచ్చుకొనినతోడనే జీర్ణమగును.

## 6. ధాతువృద్ధికరపదార్థములు.

ఇవి ధాతువృద్ధిని కలిగించుటయందు స్వతంత్రముగాను కలిసిగాను మిక్కిలిగా ఉపయోగపడియెడు ఆహారమును వస్తువులును.

ఆవుపాలు, నెయి, కంచమేకపాలు, మట్టపాలు, టెంకాయపాలు, ప్రత్తిగింజలరసము, క్షీరాన్నము, పాయసము, లెస్సగా మాగిన అరటిపండు, సీమరేగుపండు, ద్రాక్షపండు, పిస్తాపప్పు, బాదముపప్పు, ముంతమామిడిపప్పు, సారవిత్తులు, దోసవిత్తులు, సీమదోసవిత్తులు, పిసిపప్పు, కొబ్బెర, ఖర్జూరపుకాయ, సెనగలు, అనుములు, అలసందెలు, కడిగిననువ్వులు, ఏడాదికి లోబడిన వయస్సుగల క్రొవ్విన వేటమాంసము, క్రొవ్విన పుంజు, కౌజు, పూరేడు, ఉడుము వీనిమాంసము అప్పుడు పట్టిన మంచినీళ్లలోని చేపలు, మలుగుచేప, చేపజన, కోడిగ్రుడ్లు, పక్షిగ్రుడ్లు, వాని తల, మెదడు, సాలామిశ్రి, మునగవిత్తులు, ముల్లంగివిత్తులు, ఉత్తరేనివిత్తులు, నీరుల్లివిత్తులు, గసగసలు, నేలతాటిగడ్డ, భూమిచక్కరగడ్డ, పెండలపుదుంప, శొంఠి, మిరియాలు, తెల్లమిరియాలు, పిప్పళ్లు, అక్కలకఱ్ఱ, లవంగములు, కోష్ఠము, మెంతులు, ఇంగువ, జాపత్రి, లవంగపట్ట, అగరుచెక్క, మునగబంక, నల్లతుమ్మబంక, తంగేడుబంక, కస్తూరి, గుల్కండు, మునగకాడలు, నీరుల్లిగెడ్డలు, ముల్లంగిదుంపలు, మగ ఊరబిచ్చుకమాంసము, పావురపుమాంసము లోనగునవి.

## 7. సెనగలనీళ్లు.

6 తులముల సెనగలను రాత్రిపూట గిద్దెడు నీళ్లయందు నానవేసి వేకువను సన్నని వస్త్రమునందు ముడివేసి వేలగట్టినయెడల నీరు వడియును. అట్లు వడిసిన

నీళ్లతో శుద్ధిజేసిన తేనె రెండుతులములు గలిపి ఉపయోగింపవలయును. ఈలాగు నలుబదిదినములు చేయవలసినది.

ఇందువల్ల రేతస్సు ఎక్కువగా నుత్పన్నమగును. పగిలిన ఇంద్రియము గట్టిపడి స్థంభించును. సంభోగశక్తియు ఎక్కువయగును. ధాతువృద్ధికి వినియోగపడునట్టి వస్తువులందు శనగలకు మించినది మరియొకటి లేదనుట యూనానిమతము.

## 8. కలవింకము మురబ్బా.

మగ ఊరపిచ్చుకలు 40. వీనితల, కాళ్లు, ప్రేగులు, బొచ్చులో నగువానిని తొలగించి నీళ్లయందు లెస్సగా కడిగి గుడ్డతో దుడిచి శక్తికి తగినయట్లు నేయి విడిచి ఎఱ్ఱగా వేచుకొనవలయును. మంచితేనె వీసె 1½ తేనెను శుద్ధిచేసి మీద చెప్పిన పిచ్చికలను దానియందుంచి మూసి భద్రము జేయవలయును. ఉదయకాలమున తోలు ఊడదీసిన బాదముపప్పు రెండిటిని కొంచెము కలకండతో జేర్చి నమలి మ్రింగిన తోడనే మీద జెప్పిన మురబ్బాయందు ఒకటిని దినవలయును. రాత్రిపూట పరుండ బోవుటకు ముందుగా ఒకటిని ఉపయోగించి వెంబడిని కొంచెము తేనెను త్రాగవలయును.

గుణము :—ఇంద్రియము మిక్కిలిగా ఊరును. రక్తము పరిశుద్ధమగును. సంభోగశక్తి మిక్కిలిగా గలుగును.

మీద చెప్పినదానిని ఉపయోగించునపుడు కఠినముగా నున్న ఎముకలను వదలి తక్కినదానినే నమలి మ్రింగవలయును.

తేనెను ఒక మట్టిపాత్రమునందు వుంచి కాచగా నురుగుకట్టి పొంగివచ్చును. అప్పు డందొక విధమైన సుడి కలుగును. అదియే సరియైన పదను అని పాత్రమును దించి కొంచెము ఒరిగించి మీద నురుగును దీసివేయవలయును. ఇట్లు శుద్ధిచేసిన తేనెనే వేరుగాగాని ఔషధములతోడగాని యుపయోగపరుపవలసినది.

## 9. దేహాశమన లేహ్యము.

పాలసుగంధచూర్ణము :— పంచదార, ఆవునేతిని లేహ్యముగా వండి సేవింపను మేహశమనము.

## 10. శృంగిలేహ్యము.

సుదర దుప్పికొమ్ము పైడికాయనీళ్లతో గంధంతీసిన ముద్ద తులములు 12. లవంగాలు, యాలకులు, జాజికాయ, దాల్చిని, తేజపత్రము అనగా ఆకుపత్రి 1

తులంచొప్పున పాలసుగంధిగుండ రత్నపురుసుము 2 చొప్పున తులములు 6. సాలామిశ్రి కల్పి కాటుకవలె నూరవలెను. తరువాతను ఆవునెయ్యి కరగించి పంచదార గుండ వేసి పాకంరా చూచికొని సాలామిశ్రితో నూరబడిన దుష్పికొమ్ము ముద్ద కలిపి ఈ వాసనదినుసుల చూర్ణము వేసి కలిపి గాజుగిన్నెలో వాసన కట్టియుంచి ఉదయం సాయంకాలము కుంకుడుపిక్క ప్రమాణమున పుచ్చుకొనవలయును. పథ్యం. మధుర ఆహారములు. ఇందువల్లను మేహాశమనము, ధాతువృద్ధి, పుష్టి, స్తంభనము వగైరాలు గలుగును.

## 11. ఇనుము - ఉక్కు భస్మములు.

వీనిలో దేనియొక్క రాపాడినిగాని మూడుదినములు రేయింబగలు పశుమూత్రమునందు నానజేసి పిమ్మట లెస్సగా కడిగి ఒకపింగాణియందు పెట్టి నిమ్మపండు రసమును రాపాడిమీద మూడు అంగుళములు నిలుచునట్లు విడువవలయును. పిమ్మట మూతికి గట్టిగా చీలమన్ను (5) తేపలు చేసి ఒకగజము లోతుగల గోతియందు గుఱ్ఱపు పేడనుగాని, పేడనుగాని నింపి మీద చెప్పిన పింగాణిని దానియందు పూడ్చిపెట్ట వలయును. మూడువారములు వెళ్లినపిమ్మట పింగాణిని ఎత్తుకొని కరక్కాయ, సెల్లివరుగు, తాడికాయ వీనిని సమముగా తూచుకొని అతూనికకు ఆరుపాళ్లు నీళ్లు విడిచి మూట రెండుపాళ్లు ఇగురునట్లుగా కాచిన కషాయముతో మీద శుద్ధిచేసిన రాపాడిని ఖల్వమున నూఱవలయును. ఇట్లు మూడుదినములు నూఱి బిళ్లలుచేసి యెండబెట్టి పెంకులో ఉంచి చీలమన్ను (5) తేపలు తీసి అరగజము గోతియందు చింతబరడునుగాని ఏఱుఁనుగ్గులనుగాని నింపి అందు ఈ మందును పెట్టి పుటము పెట్టవలయును. ఇట్లు రెండుపుటములు వేసి యెత్తుకొవలయును. దీనిని ప్రత్యేకముగాగాని లేహ్యములో నగుహానితో కలిపిగాని ఉపయోగింపవచ్చును. దీనిమహిమను చెప్ప తరముగాదు. రక్తమును పుట్టించుటయందు దీనికి సమమయిన ఔషధములేదని చెప్పవలయును. ఇది సింధూరము కాదు.

## 12. కీలువాతమునకు పైపూయు ప్రయోగము.

40 పలముల జలములో 10 పలముల గోరింటాకును లేక గోరింటపువ్వు వేసి కాచి ½ భాగముగా ఇగరనిచ్చి దించి పిసికి వడిగట్టి పిప్పిని విడచి కషాయములో సగభాగము నువ్వులనూనె కలిపి నీరు ఇగురునటుల కాచి వడిగట్టి ఉంచుకొనవలయును.

ఈ చమురును నొప్పిగలచోట పూయుచువచ్చిన కీలువాతము మొదలగు అనేకవాయువులు తీరును.

పథ్యము:—రోగికి పడక మొదలగునవి మెత్తగ యుండవలయును. తడిగాలి తగులకుండుటయు, శరీర ముష్ణము గానుండుటయు, ఉష్ణములగు వస్త్రములను ధరించుకొనునటులను చేయవలయును. శీఘ్రముగా జీర్ణించతగినదియును సత్తువగలదియును గల ఆహారముండవలయును. చక్కెర సారాయము మొదలగునవి కూడవు.

## 13 తెల్లవంగభస్మము.

శుద్ధిచేసిన తెల్లవంగము 1½ పలము. దీనిని చింతాకుమందముగల రేకులుగా జేసి సన్నముగా కత్తిరించుకొనవలయు. ముదిరిన వేపపట్ట, రావిపట్ట, చింతబెరడు, నిమ్మచెట్టుపట్ట ఇవి దినుసుకు 10 పలములు. వీటిని దంచి చూర్ణము చేసికొనవలయును. వాడిన గంజాయియాకు పదిపలములు. దీనిని పొడ చేసికొనవలయును. వీనినన్నిటిని గలిపి కొంచెము దంచి పొడిచేసి వుంచుకొనవలయును. గాలికి మరుగగుతావున ఒకమూర చదరముగల గుంట త్రవ్వి దానికి సగమునకు పిడకలు అడికి దానిపై ముప్పాతికమూర చదరమగు మతికగుడ్డ పరచి దానిపై కొంచెము పై జెప్పిన పొడిని పరచి ఆమీదను వంగము రేకులపొడిని యొకటితో నొకటి జేరకయుండునటుల పెట్టి ఆ వెనుక ముందటి పొడినే పరచి ఆమీదు వంగ రేకుల పొడిని పోసి ఆపైని ముందటి పొడిని పరపుము. ఈలాగు పొడినిన్ని వంగ రేకుల పొడినిన్ని ఒక దానిపై నొకటి మట్టమట్టగా పెట్టి దానిపై మున్నువలె మతికగుడ్డను పరచి గుంటనిండ పిడకలు అడికి పుటము వేసి చక్కగా చల్లారినవెనుక మెల్లగా విప్పి అతిజాగ్రత్తతో చూచి తేలియుండునవి అన్నియు ఏరికల్వములో నూరి వస్త్రగాలితము చేయవలయును. తేలకుండా యుండు వానిని తిరుగా ముందువలె నాలాగే జేసికొనవలయును.

వంగశుద్ధి:—వంగమును కరగించి అదినముణిగిపోవునంత కాడిని ఒకకుండలో పోసి దానిలో జాగ్రత్తగా పోయవలయును. చక్కగా చల్లారినవెనుక ఆవంగమును ఎత్తి కరగించి పూర్వమువలెనే కాడిని పోసి మున్నువలెనే చేయవలయును. ఈలాగు ప్రతితడవయున్న కాడిని క్రొత్తదిగా పోయుచుండవలయును. పై చెప్పిన ప్రకారము కాడియందు మూడుపర్యాయములున్ను అదేవిధమున నువ్వులనూనెలో 3 పర్యాయములున్ను ఆలాగే గోమూత్రములో మూడుపర్యాయములున్ను (కాడి

అనగా తగవాణి)—ఉలవల నుడికించినజలములో మూడుతడవలున్ను జిల్లేడుపాలలో మూడుతడవలున్ను కరగి పోసిన శుద్ధియగును. ఒక్కొక్క దినుసు ద్రవమున్ను ప్రతి సారికి క్రొత్తదిగా మార్చుకొనవలయును.

వంగభస్మముయొక్క గుణములు:—శుద్ధిచేయబడినదియును, చేభాగములు మొదలగునవి విధిప్రకారము జేయబడి దోషరహితము అయినదియు నగు వంగభస్మము వలన ధాతువృద్ధి, జీర్ణశక్తి, ఇవి గలుగును. హృదయము బలపడును. ప్రమేహము, పాండురోగము, శ్వాసకోశరోగము, క్రిమిరోగము అగునవి తీరును. మాత్ర వేళకు ఒక గురిగింజయెత్తు శరీరస్వభావమునకు తగిన అనుపానముతో పుచ్చుకొనవలయును. 21 రోజులకు అధికముగా పుచ్చుకొనుట మంచిదికాదు. అలాగు చేయ అవశ్యమయిన మధ్యను రెండువారములు విడిచి తిరుగా ఆరంభించవలయును.

వంగభస్మముయొక్క దుర్గుణములు:—శుద్ధిచేయబడని వంగభస్మమును లోపలికి పుచ్చుకొనినను, యేలాటిదైనను దోషము గలదానిని లోపలికి పుచ్చుకొని నను, వెంబడినే బహుదినములు పుచ్చుకొనినను, అపథ్యము జేసినను, చర్మమును పట్టిన రోగములు, కుష్ఠులు, కడుపునెప్పి, శీతభేది మొదలగువానివంటి నరము నంటిన వ్యాధులు నోరు ఊన్పు అగునవి కలుగును.

## 14. కుష్ఠుకుఠారము.

ముదరిన వేపపట్ట, వేపకాయలు, వేపపిందెలు, వేపపువ్వులు, వేపాకు, వేప చిగురు, వేపవేరుపట్ట. ఈ యేండిటిని వెవ్వేరుగా నీడయందు ఎండించి వేరువేరు రోట దంచిన మార్గము దినుసునకు సమభాగముగా చేర్చి గగ ½ మొదలు మూడుదినము లకు ఒక్కతేప గగ ½ ఎక్కువజేసి 2 గగల యెత్తు అయినతర్వాత ఆతూనికయే 60-90 దినములు పుచ్చుకొన్నపక్షములో కుష్ఠవ్యాధి, కాలివ్రేళ్లు, చేతివ్రేళ్లు తినెడి వ్యాధి, ఆరనివ్రణములు, తీరని మేహవ్యాధులు కుదురును.

ఇది పెద్దలు ఒకరు చెప్పినది. దీనిని పలుతేపలు చేసి అనేకులకు ఇప్పించగా గుణము చూపియున్నది. ఇది అనుభవసిద్ధము. మీద చెప్పిన కుష్ఠవ్యాధి అంటగానే దీని సేవించినయెడల ఆవ్యాధి తలయెత్తనేరదు. మొదలంట నష్టమయిపోవును.

## 15. కలరాచికిత్స.

వేడెత్తు గంజాయినీళ్లతో నూరి పావుసేరు నీళ్లలో కలిపి వడియగట్టి గంటకు పుక్కెడునీళ్లు పుచ్చుకొన్నయెడల కలరావ్యాధి మానును.

## 16. భస్మములయొక్క సముదాయ పరీక్షవగైరాలు.

1. రసము, కర్పూరము, గంధకము, ఇంగ్లీకము, పాషాణము, ముదారసింగు అగు వీనియొక్క భస్మములను పెట్టిన యెత్తు తగ్గక యుండుటయగాక వాటిని నిప్పుపై వేసిన అవి పొగలేవకను పారిపోవకను ఉన్నపక్షమున మిక్కిలి శ్రేష్ఠమైనది. ఈలాగు అమరుట అపూర్వము.

2. బంగారు, వెండి, తామ్రము, వంగము, అయము, ఉక్కు మొదలగు వాటియొక్క భస్మములను జలములో వేసి వాటిమీదను బియ్యమును లేక గోధుమలను వేసిన అవి మునుగక తేలిన అతిశ్రేష్ఠమైనవి.

3. వంగభస్మమును నిప్పులో వేసి చూచిన అది యెట్టబారిన హెచ్చైనది. లేని యెడల మట్టమయినది అని తెలిసికొనవలయును.

4. రసము, గంధకము, ఇంగిలీకము, తాళకము, పాషాణము, ముదారసింగు, రసకర్పూరము అగు వీనియొక్క భస్మములకంటెను వెండి, బంగారు, తామ్రము, వంగము, నాగము, అయము అగువానియొక్క భస్మముల పద్ధతులగునవియే మేలుకరమైనవి.

5. నూరకుండా చేయు భస్మములకంటెను నూరి చేయబడిన భస్మములు మేలుకరమైనవి.

6. పొంగించకనే అగు భస్మములకంటెను పొంగించుటవలన అగునవి శ్రేష్ఠములైనవి.

7. కారసంబంధమువలన అగు భస్మములకంటెను మూలికసంబంధమువలన నగునవి మేలుతరమైనవి.

8. నూతనభస్మములకన్నను పాతవియగునవి మేలుతరమైనవి.

9. చేసెడుభాగము మొదలగు పద్ధతిప్రకారము చేసి తీర్చిన భస్మములు మిగుల శీఘ్రముగా సుగుణమును ఇచ్చునటువలెనే చేసెడుభాగము మొదలగునవి పద్ధతి తప్పి తీర్చినవి మిక్కిలి త్వరతో దుర్గుణములను గలుగజేయునని తెలిసికొని యుండవలసినది.

10. భస్మము చేయబడవలసిన వస్తువు అసలుతరము గలదిగాను కలపడము లేనిదిగాను యుండవలయును. దానిదాని శుద్ధి క్రమప్రకారము శుద్ధియును చేసికొన వలయును. మూలికలు మంచినేలలో ఉత్పత్తి అయినవిగాను ఉండవలయును. వాడినవియు, నలిగినవియు, కుళ్లినవియును, ఉప్పుగాలి తగిలినవియును గూడదు. ఎండించవలసిన మూలికలను నీడ నెండించుకొనవలయును.

11. ఒక్కొక్క పద్ధతియందు నున్దానికి తగిన యెత్తు, ప్రమాణము, నూరెడు పరమాణము, పుటము వేయుదిట్టము మొదలగు చేపాకము చేసెడు భావము అగువాని యందు ముందు వెనుక హెచ్చుతగ్గులు గూడదు. నూరునప్పుడు మన్ను దుమ్ము మొదలగునవి పడకుండ కాపాడవలయును. మందును దహించునప్పుడు లేక పుటము వేసి యున్నప్పుడు రజస్వలస్త్రీలు అంటుగలపురుషులు వీరియొక్క నీడ దానిపై బారగూడదు. పుటము మొదలగునవి చక్కగా ఆరినవెనుకనే యెత్తవలయును. చీలమన్ను చేసి ఎండించియే దహించవలయును. ఐనను పచ్చియాకులు నూరి కవచము చేసి చీలమన్ను చేయబడినపుడు తడిని యెండించి పుటము వేయవచ్చును. ఏలయనగా పై చీలమన్ను యెండుటకు ముందుగా లోపలయుండు మూలిక యెండి చెడిపోవుటకు హేతువగును.

12. పెద్దతరగతి భస్మములను ఒకసంవత్సరము గడిచినవెనుక ఉపయోగించుట మిగుల ఉత్తమము. అవసరముగా నుపయోగించవలసినట్లు తటస్థించిన భస్మమును సీసాలో వేసి కార్కుచే మూసి వెలితిలేకుండా సందులు చక్కగా మూసి సావకాశముగలంతకాలము భూమిలో పాతిబెట్టి పిమ్మట యెత్తి ఉపయోగింపవలయును. ఏభస్మములనైనను ధాన్యమందు ఆరునెలలు యుంచి ఎత్తిన దానిగుణము విశేషించి యుండును. భస్మములను జలములో తడిపెనను మిగుల తడిగాలి తగిలినను దానిగుణము చెడును.

13. ఏలాటి భస్మమైనను బరీక్షించియే ఉపయోగింపవలయును.

14. భస్మములను లోపలికి పుచ్చుకొనునప్పుడు క్రమముగా హెచ్చించి దాని ప్రమాణమునకు తీసుకొనిరావలయును. ఒకభస్మమునకు గల ప్రమాణమునందు పాతిక భాగము ప్రారంభించి మెట్టుమెట్టుగా అధికముజేసి ముందటిప్రమాణమునకు తేవలెను. ఏలయనగా ఆలాగు చేయుటవలన రోగియొక్క శరీరబలము స్వభావము మొదలగు వానిని తెలిసికొనవచ్చును. ఒకసమయము దుర్గుణము కలిగినపక్షమున మందును నిలిపి వేయవచ్చును. లేక దానికి తగినశాంతను జేయవచ్చును.

15. అతి తీక్ష్ణద్రవ్యగుణముగల భస్మములను వానకాలమున ఉపయోగింపవచ్చును.

16. బలహీనముపడినవారు, అశక్తులు, సుకుమారశరీరులు, ఉష్ణస్వభావులును, పిల్లలు, గర్భస్త్రీలు అగు వీరలకు వేగముగల భస్మములను ఉపయోగింప గూడదు.

17. భస్మములో గొనునప్పుడు బహుజాగ్రతముగా పులుసువస్తువులు శీతలపదార్థములు సంభోగము కఠినపాటు అగునవి గూడదు.

18. ఒకభస్మము సేవించి మధ్యను కొన్నిదినములు నిలుపక వెంటనే మరియొకచికిత్సకు ఎడమివ్వగూడదు. ఏలయనగా ముందు భుజించిన భస్మము శరీరమునందు నిలిచి ఏదియైన నొకచెరుపును కలుగజేయవచ్చును. కనుకనే వెంటనే మరియొక చికిత్సను చేసికొనుట అవశ్యమైనయెడల మధ్యను రెండు మూడు రోజులైనను తామసించి మరియొక ఔషధము లోపలికి పుచ్చుకొనవలయును. అయినను తాము ముందు ఉపయోగించిన భస్మముయొక్క గుణమును తెలిసియే చేయవలయును.

## 17. తూనికలు.

2 మినపగింజలు సుమారు—1 గురిగింజ.

8 గురిగింజలు—1 మాషము.

4 మాషములు—1 గద్యాణ. లేక వరహాయెత్తు.

3¼ వరహాయెత్తు—1 తులము.

3 తులములు సుమారు—1 పలము.

8 పలములు—1 సేరు.

5 సేర్లు—1 వీశ.

## 18. కొలతలు.

15 రూపాయయెత్తు సుమారు—1 గిద్ద లేక ఆశాకు.
2 గిద్దలు—1 సోల లేక తవ్వ.
4 సోలలు—1 పడి.

## 19. ఆర్ద్రికము మురబ్బా.

లెస్సగా ముదిరిన అల్లమును నారలేనిదానిని కావలసినంత తెచ్చి ఒకపాత్రము నందుంచి దానిమీద నాలుగంగుళములు నిలుచునట్లు ఇసుకను పరపి ప్రతిదినమును నీళ్లను పోయుచురావలయును. ఈలాగు 22 దినములు చేసి కడపటిదినమందు అల్లమును ఎత్తుకొని లెస్సగా రుద్దికడిగి ఈతముండ్లకుచ్చుతో గ్రుచ్చి ఉంచుకొనవలయును. అల్లమునకు రెండింతలు తేనెయును ఒకపాలు నీళ్లను విడిచి దానియందు మీద జెప్పిన అల్లమును జేర్చి కాచి పాకముగా వచ్చునపుడు దించుకొనవలయును. మాత్ర తు ½ మొ. 1 వరకు ఉపయోగింపవచ్చును.

గుణము :—ఇది ఉష్ణమైనది గనుక ఆన్నాశయము, కందనగాయలు, బీజములు మొదలగువానియందున్న శైత్యమును పోగొట్టును. మూత్రబంధరోగమును ఖపజ్వరమును తొలగించును. సంభోగశక్తిని కలిగించును.

## 20. అల్లపుజవారిషు.

అల్లము 20 దిరములు నూరి (దిరమనగా 6 అణాలు లేక ⅜ తులములు) కచ్చాపావుసేరు పంచదారపాకము బట్టి అందులో కలిపి పుచ్చుకొనిన వాతమును వాతనొప్పులను హరించును. అన్నమును జీర్ణముచేసును. పరాకుగుణమును పోగొట్టును. పొట్టయొక్క కార్జముయొక్క శీతలమును గొట్టును.

## 21. అల్లపుసికింజబీను.

అల్లపురసము శే ½. చీనాపంచదార శే ½. తేనె శే ½. అంగూరుశిరకా శే ¼. పన్నీరు శే ½ కలిపి తేనె పాకమువలె పాకము వచ్చేవరకు కాచి దించేది. దీనిగుణములు అన్నమును జీర్ణముజేసును. ఆకలిని బుట్టించును. పైత్యము నణచును. జఠరాగ్ని వృద్ధిపొందించును. గుండెలలోని మంట నణచును. మరియు నీయౌషధములు తప్ప సత్తు రెండుతులములు కలిపి వండిన పైత్యజ్వరమును హరించును. మోతాదు తు ¼ ము మొదలు తులమువరకు నివ్వవచ్చును.

## 22. ఆంబ్ల, పిత్త, పైత్య, పాండువ, కామిళ, శ్వాస, శూల, కపహార, దీపనాగ్నికి ఖండాద్రకం.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మిరియాలు | ... | తు. $1\frac{1}{4}$ | నాగకేసరపువ్వు | ... | తు. $\frac{1}{2}$ |
| యష్టిమధుకము | ... | తు. $1\frac{1}{4}$ | ప్రియంకణపువ్వు | ... | తు. $\frac{1}{2}$ |
| పిప్పలిమూలము | ... | తు. $1\frac{1}{4}$ | యాలకులు | ... | తు. $\frac{1}{2}$ |
| పిప్పళ్లు | ... | తు. $1\frac{1}{4}$ | శొంఠి | ... | తు. $\frac{1}{2}$ |
| పాలగుండ | ... | తు. 1 | జటామాంసె | ... | తు. $\frac{1}{2}$ |
| లవంగాలు | ... | తు. 1 | ఇండుప్పకాయలు | ... | తు. $\frac{1}{2}$ |
| ధనియాలు | ... | తు. 1 | మంచిగంధము | ... | తు. $\frac{1}{4}$ |
| జాజికాయ | ... | తు. 1 | చిత్రమూలము | ... | తు. $\frac{1}{4}$ |
| దాల్చిని | ... | తు. $\frac{3}{4}$ | వట్టివేళ్లు | ... | తు. $\frac{1}{4}$ |
| ఆనుపత్రికం | ... | తు. $\frac{3}{4}$ | ఉసిరికపప్పు | ... | తు. $\frac{1}{4}$ |
| నాగకేసరాలు | ... | తు. $\frac{3}{4}$ | అల్లము | ... | శే. $2\frac{1}{2}$ |
| జీలకఱ్ఱ | ... | తు. $\frac{3}{4}$ | పంచదార | ... | శే. $2\frac{1}{2}$ |
| పుండరీకం | ... | తు. $\frac{1}{2}$ | నెయ్యి | ... | శే. $\frac{1}{4}$ |
| ప్రపుండరీకం | ... | తు. $\frac{1}{2}$ | తేనె | ... | శే. $\frac{1}{4}$ |

ఈ వస్తువులను గుండచేసి పంచదార పాకముపెట్టి అల్లము గీసి తరిగి పాకములోగుండ ఈముక్కలు వేసి కలిపి తరువాత నెయ్యి తేనె వేసి కలిపి పూటకు ఒకడబ్బు ఎత్తుచొప్పున ఇచ్ఛాపథ్యం.

# సంవత్సరస్వరనిధానము.



సంవత్సరము :—

1. ఫాల్గుణ బహుళ చతుర్దశి (ఏవార మైనను) అంత్యమున—చంద్రస్వరము.
2. ఫాల్గుణ అమావాస్య (ఏవార మైనను) ఆదియందు—సూర్యస్వరము.
3. ఫాల్గుణ అమావాస్య చైత్రశుద్ధ పాడ్యమీ, విదియ, తదియ. ఈ మూడుదినములు (ఏవార మైనను) రాత్రి నిద్రించువేళ } సూర్యస్వరం.
4. చైత్రశుద్ధ పాడ్యమీ, విదియ, తదియ. ఈ మూడుదినములు (ఏవారమునైనను) సూర్యోదయకాలము నిద్రబోయి లేవగానే } చంద్రస్వరం.
5. చైత్రశుద్ధ విదియాతిథిని (ఏవార మైనను) సాయంకాలము చంద్రోదయకాలమున } చంద్రస్వరం.
6. చైత్రశుద్ధ చవితి, పంచమి, షష్ఠి, సప్తమి, అష్టమి. ఈ తిథులయందు సూర్యోదయకాలమున నిద్రబోయి లేవగానే } వామస్వరం.
7. చైత్రశుద్ధ పాడ్యమీ, విదియ, తదియ, చవితి, పంచమి, షష్ఠి, సప్తమి, అష్టమి. ఈ తిథులయందు మూడు కాలములయందు అనగా సూర్యోదయము. మధ్యాహ్నం అనగా పగలు 12 గం. సూర్యాస్తమయ కాలములందు } భిన్నస్వరముగాక ఏకస్వరముగాను.
8. ఫాల్గుణ అమావాస్య చైత్రశుద్ధ పాడ్యమి, విదియ, తదియ, చవితి, పంచమి, షష్ఠి, సప్తమి, అష్టమి. ఈ తిథులయందు సుష్టిబోధకాలములయందు } ఏకస్వరముగాక భిన్నస్వరముగాను

యుండిన నాసంవత్సరమంతయు శుభము. వ్యత్యాసముగా నుండిన అశుభము.

రుతుశూల:—అనగా ముట్టులో కడుపునొప్పికి చికిత్స అమోఘక్రియ గచ్చకాయలలోనిపప్పు, శొంఠిపిప్పళ్లు, మిరియాలు, సైంధలవణము, ఇంగువ, వెల్లుల్లి ఇవి సమభాగములు వేసి వేనీళ్లతో నూరి కుంకుడుగింజలంత మాత్రలు జేసి బహిష్టు అయినరోజు మొదలుకొని నాలుగురోజులు ప్రొద్దున మధ్యాహ్నము సాయంకాలముచొప్పున రోజుకి మూడుసార్లు రెండేసి మాత్రలుచొప్పున నాలుగురోజులు ఇచ్చేది. నీళ్లతో యిచ్చేది. ఈప్రకారం రెండుసార్లు బహిష్టి అయినపుడు యిచ్చేది. పథ్యం—కందికట్టు, కందిపప్పు, క్షారము, చింతపొట్టు, ఆవుమజ్జిగ, నెయ్యి, కొయ్యతోటకూర, కందదోసవరుగు, బుడంవరుగు, పాతచింతకాయపచ్చడి పాతనిమ్మకాయ ఈప్రకారం ఆరురోజులు పథ్యం.

## తల పేనుకొరికి తలవెంద్రుకలు ఊడిపోయినందుకు చికిత్స.

వస, వాము, నల్లజీలకర్ర మంగళములో వేసి నల్లగా మాడ్చి కొబ్బరిపెంకు గాల్చి ఇవియన్నియు నూరి కొబ్బరినూనెలో గలిసి తలకు పట్టించేది. రెండు మూడు రోజులకు పెసరపిండిగాని, ఇప్పపిండిగాని తలకు రాచి గోరు వెచ్చనినీళ్లు పోసుకొనేది. మూర్ఛకు సతసవరం అను చెట్టు ఆకు తెచ్చి 5 మిరియాలు వేసి నూరి కందిగింజలంత మాత్రలు చేసి మూర్ఛవచ్చేసమయమునకు ముందు యివ్వవలయును.

---

జ్ఞాపిక.

ఇ

శ్లో॥ పుస్తకంవనితావిత్తం పరహస్తంగతంగతః।
అథవాపునరాయాతం నష్టం భ్రష్టం చఖండనం॥

సమాప్తము.



# శ్రీ ప్రపంచచరిత్రసారాంశము.

భగవాన్ వాచ.

శ్లో॥ పరిత్రాణాయసాధూనాం వినాశాయచదుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామియుగేయుగే॥

ధర్మము క్షీణించినప్పుడు పరమేశ్వరుని తేజస్సు అత్యద్భుతముగా లోకమునందు ప్రవహించి ధర్మమును స్థాపించుచుండుట ప్రపంచకమందు స్వాభావికమై యుండుట చేత కాలస్వరూపియైన పరమేశ్వరునియందు కాలానుగుణ్యముగా మహాఋషులును, మహాపురుషులును నీ మొదలుగాగల వివిధములైన యవతారములు లోకమునందు వచ్చుచు మానుషధర్మములైన సత్యజ్ఞానదయాధర్మములను సమముగా నడపించుటకు మార్గము లప్పుడప్పుడు వేయుచున్నారు. ఇట్టి ఘనకార్యములయందు వారికి పంచభూతాత్మకమైన శరీరమునకు కలుగవలసినకష్టములన్నియు వారు లోకమందున్నప్పుడు కలిగినను వానినన్నిటిని అనిత్యములని లక్ష్యముజేయక తమకార్యమును నెరవేర్చుకొని పరలోకమునుండి తమసహచారులకు సహాయ్యులై యుందురు. గనుక అట్టి పుణ్యాత్ములచారిత్రములు గ్రంథస్థములై వారితదనంతరప్రజల ననేకులను తరింపజేయుచున్నవి. సత్యమే నిత్యమని మెలంగెడి నీతివంతుల జీవితములు లోకమునకు ఆదర్శములై యుండును గనుక యట్టి సత్యజ్ఞానానందములు గలిగియున్నవారె మనుష్యులు [illegible] నుటకు దగినవారుగాని తదితరులు మనుష్యు లనిపించుకొనరని సర్వజనులును దలంచి అట్టి [illegible] రీతగలిగి ధర్మపక్ష మవలంబించుటకు ప్రపంచమం దవతరించినారమనటుల విశ్వకర్మకులమునందు సుపర్ణసగోత్రీకులైన కొత్తు [illegible] -వీరాచారిపాత్రులును శంకరాచారపుత్రులునైన బ్రహ్మశ్రీ [illegible] నారిమహ ఋషిగారు చెన్నపురరాజధానిలో వైశాఖపురంబున జననమంది సమస్త ధైర్య స్థైర్య [illegible] సద్గుణంబులతో పెరిగి ఆంధ్రగీర్వాణాంగ్లయహిందూస్థానీభాషల నభ్యసించి కావ్యవ్యాకరణనాటకాలంకారచరిత్రములను బరిశీలించి వేదాధ్యయన

యుండిన నా

# ప్రథమభాగము.

మును గ్రహించి భాష్యయుక్తంబుగా గృహ్యసూత్ర మంత్ర ప్రశ్నంబులను తదనుక్ర[...] కాదులను ఛందస్సును బాలబోధిగా జేయుచు న్యాయధర్మయుక్తవివేక ప్రజ్ఞావంతులై పవిత్రకులసాంప్రదాయంబు లెట్టివో, అపవిత్ర జనదుష్టత్రయంబు లెట్టివో హంస క్షీరోదకవిభజన చేసినటుల నే విభజించి నట్టిసాంప్రదాయంబులు సులభసాధ్యమగు నటుల సాధ్యపఱచుచు విశ్వకర్మసాంప్రదాయముఖరంబను స్వకీయముద్రాక్షరశాలను స్థాపించి నీకలియుగమునందు అబ్రహ్మభూయిష్టులుగా జేయబడియున్న పవిత్రజన సంస్కారణాభిమానజాత్యభిమానావేశంబున స్వకాయకష్టవ్యయంబున రచించిన స్నాన సంధ్యానుష్ఠానసంక్షేపణవిధగ్రంథంబును ముద్రింపించి నిష్కాపట్యాంత్యీకరణతో పవిత్రకులసాంప్రదాయమును ప్రచురించుట కెంచి సమస్తగ్రంథములను శోధించి అందు తాము కనిపట్టిన ప్రమాదములను కల్పనాకథలను పూర్వపక్షము జేయుచు పవిత్రాపవిత్రములను వెల్లడించునటుల సమస్తశాస్త్రపురాణేతిహాసాంతర్గామములైన ప్రపంచచారిత్రమను నొక దివ్యమైన పవిత్రగ్రంథమును రచియించిరి. నద్దాని యందు వ్రాసినయంశములు ముఖ్యమైనవి— ఆద్యంతరహితమైన అవ్యక్తయంత్రవ విలాసమును, ఆకాశాదిపంచభూతమయమైన సర్వప్రపంచసృష్టియు, నండబ్రహ్మాండ నిర్మాణంబును, వానిలో సూర్యగ్రహనక్షత్రసాంప్రదాయంబును, వాని వివిధశక్తులును, దారుశిలాలోహాదికరలసాంప్రదాయంబును, అధిదేవతల ఆధిభూతంబుల సాంప్రదాయంబులును, భూచరజలచరజంతుసాంప్రదాయంబును, జగదీశ్వరనిర్ణయంబును, అయోనిసంభవంబగు పౌర్ణేయబ్రాహ్మణసాంప్రదాయంబును, స్త్రీగణనిర్మాణ సాంప్రదాయంబును, యుగమహిమాదివిశేషంబులును, బ్రాహ్మణసాంప్రదాయంబును, సూక్ష్మశరీరధారణసిద్ధాంతిసాంప్రదాయంబును, అష్టాంగయోగసిద్ధసాంప్రదాయంబును, ఓషధమహిమాసాంప్రదాయంబును, వైదికకర్మసాంప్రదాయంబును, మహాఋషుల సాంప్రదాయంబును, మహాఋషులు సంపూర్ణజ్ఞానులై శాసించునవి వాప సద్ధర్మ[...]బును, వ్యభిచారజారత్వనిషేధంబును, సంబంధబాంధవ్యవివా[...]ంబును, పాతివ్రత్యహీనస్త్రీకులభ్రష్టత్వసిద్ధాంతంబును, [...]సపాక సాంగత్య స్పర్శనిషేదనసిద్ధాంతంబును, అపవిత్రసంస్పర్శదోషప్రాయశ్చిత్తాద్యనుష్ఠానవిధ సిద్ధాంతంబులసాంప్రదాయంబును, సమస్తపవిత్రజనపూర్వులసాంప్రదాయంబును, పవిత్ర హాస్యగు...యున శ్రీరామ, పరశురామ, కౌశిక, రావణ, జరాసంధ మొదలుగాగల ...యుగజనులసాంప్రదాయంబును పూర్వయుగములలో ద్వాపరయుగాంతము వరకు కులశీలంబగు పాతివ్రత్యము వెన్నెనొందక పరిపాలింపబడిన నిరూపణంబును పవిత్రకుల[...]

నితులైనట్టియు యదువంశతిలకులైనట్టియు శ్రీకృష్ణులవారియనంతరము వారి ప్రపౌత్ర
నయుండైనట్టియు, మధురాపట్టణపురాజ్యాభిషిక్తుండైనట్టియు, వజ్రమహారాజుయొక్క
ప్రపౌత్రతనయుండగు శతసేనమహారాజువల్ల కలియుగప్రవేశ మప్పటికి సహస్ర
క్షనులైయుండగా పశుప్రాయులుగా నడవులయందు అపరిమితముగా వృద్ధినొంది
ర్మార్గములను జేయుచు ప్రజల బీడింపుచుండిన అపవిత్రబృందములకు దుర్మార్గములను
న్నుటకై విద్యలు నేర్పింపబడి నానాటికి నాగరికులై రాజ్యపరిపాలనాకాంక్షచే
నుపవిత్ర లేవిధముగా కృతఘ్నులైనా శతసేనమహారాజును యుద్ధమునందు జంపిరో
వివరంబును, నాశతిసేనమహారాజుతో యదువంశంబు నంతంబు నొందుటయు, ధర్మ
జానంతరం ధర్మరాజభ్రాతయగు నర్జునునికి పౌత్రుండైనట్టియు, హస్తినాపురిరాజ్యాభి
ుండైనట్టియు, పరీక్షిన్మహారాజునకు నాల్గవతరమువాడైన అశ్వమేధజయమహారాజ
ంపరవంశములో బ్రహ్మక్షత్రగార్గ్యాజుతో హస్తినాపురమందు కలియుగశతాబ్దములు
14 అయి యుండగా పవిత్రకులరాజ్యాంగంబు ముగిసెననియు, నాసమయమందు
సంధవంశములో రిపుంజయమహారాజుతోను రిపుంజయను జంపిన మంత్రికుమారుడు
్యోతనులలో కడపటివానిని సంహరించివచ్చిన శిశునాహుండును, నాశిశునాహ
ం పదుగురు పాలించి తదుపరనందివర్ధనునికుమారుండైన మహానందుండనువాడు
హాపురుండై కులభ్రష్టస్త్రీయందు సంపర్కము గలిగినందున నందుండను నొక
ండు బుట్టి తండ్రియగు మహానందుని మంగళవంతులైన భార్యలకు బుట్టినకుమా
అపవిత్రజనసహాయ్యంబున రాజ్యభ్రష్టులనుగా జేసి తాను సింహాసనమును
న కారణమున మగధరాజ్యంబు అపవిత్రజనాధీనంబయ్యెననియు, లోగడ
మ, బలరామ, పరశురామ, పాండవయుద్ధములకారణంబున రాజబోయెడు
నుగుణ్యామైన మార్పుకొరకు విశేషముగా సమసిపోయిరనియు, అబలలైన స్త్రీల
ప్రత్యమును కాపాడుటకు లోభము గలిగి అపవిత్రత్వంబు ప్రబలుచు వచ్చె
ను [illegible] నాశనకారణములు లేక అడవులయందును కొండలయందును అపరిమిత
వృద్ధినొం [illegible] కలియుగమునకు మహావృక్షములుగా ప్రబలుటకై
డినవిత్తనములుగా నుండి [illegible] ర్మార్గములకు వెరవక ఘోరంబులకు జడి
నేరంబులకు జంకక ఇచ్ఛావిలాసంబుగా సంచరించు [illegible] దేశమందు భిక్షాటనమును
యందు చోరత్వమును నవలంబించి బహుసెల్లిగాయున్న పాప [illegible]
ుల కుచలత్వంబు గలుగజేయుకార్యములయందు పనిగలిగి యీ స [illegible] రముగాను
అసంఖ్యాగణికంబులుగా పెరిగిన యీ నందునిసాహసస్థైర్య [illegible]

జనితులైనట్టియు యదువంశతిలకులైనట్టియు శ్రీకృష్ణులవారియనంతరము వారి ప్రపౌత్ర తనయుండైనట్టియు, మధురాపట్టణపురాజ్యాభిషిక్తుండైనట్టియు, వజ్రమహారాజుయొక్క ప్రపౌత్రతనయుండగు శతసేనమహారాజువల్ల కలియుగప్రవేశ మప్పటికి సహస్ర వర్షములైయుండగా పశుప్రాయులుగా నడవులయందు అపరిమితముగా వృద్ధినొంది దుర్మార్గములను జేయుచు ప్రజల బీడింపుచుండిన అపవిత్రబృందములకు దుర్మార్గములను మాన్పుటకై విద్యలు నేర్పింపబడి నానాటికి నాగరికులై రాజ్యపరిపాలనాకాంక్షచే నీయపవిత్రు లేవిధముగా కృతఘ్నులైనా శతసేనమహారాజును యుద్ధమునందు జంపిరో నావివరంబును, నాశతసేనమహారాజుతో యదువంశంబు నంతంబు నొందుటయు, ధర్మ రాజానంతరం ధర్మరాజభ్రాతయగు అర్జునునికి పౌత్రుండైనట్టియు, హస్తినాపురిరాజ్యాభి షిక్తుండైనట్టియు, పరీక్షిన్మహారాజునకు నాల్గవతరమువాడైన అశ్వమేధజయమహారాజ పరంపరవంశములో బ్రహ్మక్షత్రరాజుతో హస్తినాపురమందు కలియుగశతాబ్దములు 2,774 అయి యుండగా పవిత్రకులరాజ్యాంగంబు ముగి... వ్యభిచారకర్మను చేసిన జరాసంధవంశములో రిపుంజయమహా... ప్రద్యోతన... బడుచుండిరనియు న్యాయశాసనసిద్ధాంతకులైన బ్రహ్మదులు సర్వేసర్వత్ర వ్యా... మానుజనపర్యంతము ...యును ఈ అపవిత్రకర్మ బ్రహ్మాదిసమస్తసామాన్యజనపర్యంతము ...గాక ...వచ్చినపురాణము ...ముచు వచ్చునట్లుగను నటుల జేసినవారు కులబాహ్యులు ...యము జ్ఞానము నభివృద్ధి... మందు వ్యభిచార మంత పట్టణదలగా ...రణంబున వారిశిష్యులగు పైల, వైశం ...పురాణములన్ని వ్యాసప్రోక్తములని ప్రకటింపుచు కథలు కల్పనక...రిదులగువారిచే రచియింపబడినగ్రంథములన్నియు వ్యాసుల ...శమనియు ఇట్టిప్రజ్ఞావంతులవల్ల అనేకప్రజలు బ్రహ్మత్వమును పొంది ...రానుగ్రహపాత్రులైయున్నారనియు నిటు లనేకులు హిరణ్మయ, ఇలావృత, భద్రాశ్వ, కేతుమాల, కింపురుష, హరిరమ్యక వర్షంబులలో కలియుగప్రవృత్తి అపవిత్రులు ప్రబలి పవిత్రకులజులు హింసింపబడిరనియును మ్లేచ్ఛులు, తురష్కులు, యవనులు, హూణులు, ఆంగ్లేయులు, పరాంశులు, ఊడతికచులు, పళిందులు, కిరాతులు, కీచ కులు, కళింగులు, కన్నడీలు, బర్బరులు, గరుండులు, మురండులు, మంద్రులు ఇత్యాదినానావిధదేశనామంబులు 3,200 సంవత్సరంబులక్రిందట మూసా, యీ... లూకా, జాన్, మహాపద్మపతి మొదలైనవారు నాడుపవిత్రకులజులకు తప్పపోయి రాత్రి ...పమునదీవులు అపవిత్రులచే నిండియున్నప్పుడు అట్టియపవిత్రమును వారి సుఖంబుల కుచలత్వంబు ...టకు వచ్చిన మతోద్ధారకులమతములలో అబ్రా మునకు అసంఖ్యాగణికంబులుగ ...లు చేరి మారిపోయిరనియును ప్రపంచ